# కృష్ణరాయ విజయము

కుమార ధూర్జటి

పరిష్కర్త

డా॥ సి. వి. రామచంద్రరావు




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

**KRISHNA RAYA VIJAYAM** - *A Telugu Classic by Kumara Dhurjhati of 18th Century A D. Edited by Dr. C.V. Ramachandra Rao, M.A; Ph.D., Lecturer, Department of History, V.R. College, Nellore.*

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
హైదరాబాద్ - 500 004

ప్రచురణ 321

ప్రథమ ముద్రణ : 1981

ప్రతులు 2,000

**వెల : రూ. 4-00**

ప్రతులకు :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాద్ - 500 004

ముద్రణ: అక్వేరియన్ ప్రింటర్స్, సికింద్రాబాద్-500 003.

Paper used for the Printing of this book was made available by the Government of India at Concessional rate.

# తొలి పలుకులు

పలునాళ్ల క్రితం ముద్రితములై ఇప్పుడు అలభ్యంగాఉన్న కావ్యాలను ప్రచురించాలనే ఉద్దేశంతో అకాడమీ వేసుకున్న ప్రణాళికకు ఫలితంగా ఈ కృష్ణరాయవిజయ కావ్యాన్ని తెలుగుపఠితృలోకం అందుకోగలుగుతున్నది. ఇంతవరకు వెలుగుచూడని కావ్యాలను కూడా పరిష్కరించి ప్రచురిస్తున్నది.

పదునెనిమదవ శతాబ్దము వాడైన కుమార ధూర్జటి రచించిన నాలుగు ఆశ్వాసాల చారిత్రక కావ్యమిది. శ్రీకృష్ణదేవరాయల చరిత్రం ఇందలి ఇతివృత్తం. అయితేపదనారవశతమానంలో వచ్చిన విశ్వనాథనాయని స్థానాపతి రాయవాచకం దీనికిమూలం. రాయవాచకం వచనగ్రంథం. భాషా విషయ పరిశోధకులకు అత్యంతోపయుక్తమైన గ్రంథం. అకాడమీప్రచురణగా ఈగ్రంథం కూడా వస్తున్నది. కుమారధూర్జటి ఈ చారిత్రక కావ్యాన్ని వీరశృంగారరసభరితంగా, వర్ణనాత్మకంగా, సముచిత శబ్దార్థాలంకార సంయుక్తంగారచించి శుష్కమైన చారిత్రకాంశాలను రసార్ద్రం చేయగలిగినాడు. రాయవాచకాన్ని అనుసరించడంవల్ల అందులోని ఉర్దూ ఫార్సీ పదజాలం నుంచి కుమార ధూర్జటి తప్పించుకోలేకపోయినాడు. అన్యదేశ్యాలనలకు సరియైన తెలుగు మాటలు తెలియకకాదు. ఒక విధమైన మిశ్రమ సంస్కృతి మొగ్గదొడుగుతున్న ఆకాలంలో కొందరు కవులు ఇలాంటి ప్రయోగాలు చేసి జనప్రియత్వం సంపాదించుకోవాలనుకున్నారు. సమకాలిక ప్రజల జీవిత వృత్తాన్ని చెప్పేతెలుగుకావ్యాల్లో ఈ కృష్ణరాయ విజయం ఒకటి. దక్షిణ దేశంలో సంస్కృతికీ, సాహిత్యానికీ సంరక్షకుడై నిల్చిన ఒక మహనీయుని చరిత్రం ఆనాడు కావ్యబద్ధం కావడం విశేషం.

ఈ కావ్యానికి సంబంధించిన ముద్రితాముద్రిత ప్రతులను సంప్రదించి, చక్కని పీఠికను సమకూర్చి, మరింత పఠనయోగ్యంగా చేసిన డాక్టర్ సి.వి. రామచంద్రరావుగారికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

హైద్రాబాద్
17-12-1981.

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

# అనుక్రమణిక


| | |
|---|---|
| ఉపోద్ఘాతము ... ... ... | I-XI |
| కవి ఊరు, పేరు, కులము గోత్రము ... ... | XI-XIII |
| కుమార ధూర్జటి కృతులు ... ... ... | XIII-XIV |
| కుమార ధూర్జటి కాలము ... ... ... | XIV-XXIII |
| కుమార ధూర్జటి కృతులు-పూర్వ ముద్రణలు... ... | XXIII-XXV |
| కావ్యవైశిష్ట్యము ... ... ... | XXV-XXXII |
| ఉపయుక్తగ్రంథాలు, పత్రికలు... ... ... | XXXIII-XXXIV |
| సూచికలు ... ... ... ... | XXXV-XL |
| కృష్ణరాయవిజయము ... ... ... | 1-107 |

# ఉపోద్ఘాతము

## కృష్ణరాయవిజయము - రాయవాచకము

కుమారధూర్జటి కృత 'కృష్ణరాయ విజయ' కావ్యము 'రాయవాచకా'నికి పద్యానుకృతి. నేటికి లభ్యమయిన ఉపపత్తులను బట్టి విశ్వనాథనాయని స్థానాపతి రాయవాచకాన్ని క్రీ.శ. 1590-1602 ల మధ్య కాలంలో రచించాడని భావించడమయినది.[1] రాయవాచక రచనానంతరం దాదాపు నూరేండ్లకు కుమారధూర్జటి రాయవాచకానికి ఈ పద్యానుకృతిని రూపొందించాడు[2]. వచనరచనలను పద్యకావ్యంగా రూపొందించే ఈ ప్రక్రియకు ఆంధ్ర వాఙ్మయంలో, కుమార ధూర్జటికి ముందే కాసెసర్వప్ప ఒరవడి పెట్టిఉన్నాడు. కాసెసర్వప్ప ఏకామ్రనాథుడు రచించిన,చారిత్రక వచన గ్రంథమైన 'ప్రతాపచరిత్ర'ను 'సిద్ధేశ్వరచరిత్ర' అనేపేరుతో ద్విపదకావ్యంగా మలిచాడు."నాగనాథుని యడుగులకు మ్రొక్కి చాలయతని యనుమతి నేకామ్రనాథుండు-మతి మీర చెప్పిన కథ వచించెద"నని కాసెసర్వప్ప తనకావ్యంలో స్పష్టంగా చెప్పాడు.[3]

కృష్ణరాయవిజయంలో ఎక్కడా రాయవాచక ప్రసక్తి లేదు. రాయవాచకాన్ననుసరించి కృష్ణరాయ విజయాన్ని తాను రూపొందించినట్లు కుమార ధూర్జటి ఆ కావ్యంలో ఎక్కడా చెప్పలేదు.

తాను కృష్ణరాయ విజయాన్ని ఏల వ్రాయ వలసి వచ్చిందనే ప్రశ్నకు సమాధానంగా కుమార ధూర్జటి ఒక కథను సృష్టించాడు. తాను 'ప్రబంధ మొక్కటి యనువందఁగ రచనఁ జేతునని' తలస్తూ ఉండగా, కలలో నిఖిల

లోకకర్త' అయిన శ్రీరామచంద్రుడు కనిపించి "వింత దనర" 'వేగకృతి సేయు మొకకథ'అని,దానిని తనకంకిత మిమ్మని చెప్పి, అంతర్హితుడయినాడు[4] ఆ దేవునిఆనతి మేరకుప్రబంధ మొకటి చేయతలపు కలిగివుండే సమయంలో, కుమార ధూర్జటి, "వీణాధరార్థమాధుర్య ధుర్య వాగ్ధోరణీ సమన్విత కవితా లతా పునస్సముత్పాదనా మోదసన్మహాకవీంద్ర జాలాలవాల సంపూరిత కనక వర్షుండును", "వివిధ కళారంసాభిజ్ఞుండును," "రామపృథ్వీరమణ సాధ్వీమణి నాంచారమాంబాగర్భశుక్తిముక్తాఫలంబును' అయి, "సకల కవిరాజ రక్ష ణోద్యుకత వెలయునట్టి యార్వీటి చిన వెంకటావనీంద్రు'ని, ఒకనాడు పొడగని వారి 'భూరి మహిమ'ను "మఱియుమఱియు నుప్పొంగు మధుర రచన బొదమి సంస్తుతి" చేయడం జరిగింది.[5] అంత, ఆర్వీటిచిన వెంక టాద్రి ఒకనాడు, నిండు పేరోలగంలో, కరుణా కటాక్ష వీక్షణాలతో, కుమార ధూర్జటిని పిలిచి, అతని కవితాశక్తిని ప్రశంసించి "ప్రాకట గతిఁ బద్య కావ్యఫణితిం జెపుమా శ్రీకృష్ణరాయ చరితము నీ కవితాప్రౌఢి సుకవినికరము మెచ్చన్' అని, హారాలు, తాళి, చీకట్లు మొదలయిన కానుకలతో పాటు, ఫల, చందన సంయుత కర్పూర వీటిక నిచ్చి సత్కరించి, కుమార ధూర్జటిని కావ్యరచనకు ప్రోత్సహించాడు.[6]

ఆర్వీటి చినవెంకటాద్రి కుమార ధూర్జటిని ఏ పురాణ ప్రసిద్ధమయిన ఇతి వృత్తాన్నో, ఏ పురాణపురుషుడి అద్భుత వృత్తాంతాన్నో తీసుకొని కావ్యంగా మలచ మనక, చారిత్రక మహాపురుషుడు, సాహితీ సమరాంగణ సార్వభౌముడు, విజయనగర రాజుల పరంపరలో తనకు పూర్వుడు అయిన కృష్ణదేవ రాయల చరిత్రను కావ్యంగా రూపొందించమనడంలో ఒక విశేషం, ఔచిత్యం ఉంది. చినవెంకటాద్రి తండ్రి కోదండ రామరాజు అందుగుల వెంకయ్య చేత తన వంశస్థులయిన/ఆర్వీటి పాలకుల చరితాన్ని 'నరపతి విజయ' మనే కావ్యంగా వ్రాయించి ఉన్నాడు. అదే పద్ధతిలో, విజయనగర రాజుల పరంపరలో తనకు పూర్వుడు, రాయసింహా సనాధికారాన్ని చేపట్టిన

ఆరవీటి పాలకులలో మొదటి వారయిన 'అళియ' రామరాయలకు, తిరుమల రాయలకు పిల్లనిచ్చిన మామగా ఆరవీటి వంశస్థుల అభ్యున్నతికి కారకుడు, అప్రతిహత చక్రుడు అయిన కృష్ణరాయల చరిత్రాన్ని కావ్య మొనరింప జేయడం సమంజసము, కీర్తి కారకము అని చినవెంకటాద్రి తలచి కుమార ధూర్జటిని 'కృష్ణరాయ విజయ' కావ్య రచనకు ప్రోత్సహించి నాడని చెప్ప వచ్చును.

కుమార ధూర్జటి, 'పొందుగఁ గృష్ణరాయ కథనుఁ బొల్పగు కావ్యముఁ జేయ' బూనేటప్పటికి, దాని నెవ్వరికి అంకిత మియ్యవలెననే సంశయం ఏర్పడి, వెంకటాద్రిగారినే అడిగాడు. ఆయన తన కిష్టదైవమైన శ్రీరామునికి కావ్యమంకితం చేయమన్నాడు. అదే ప్రకారం, కుమార ధూర్జటి, "ఆర్వీటి వంశ చినరాజోర్వీరమణాభి రక్షణోత్సుకు"డయిన శ్రీరామునికి కృష్ణరాయ విజయాన్ని అంకిత మొనర్చాడు.[7] కలలో కనపడి తనకు కావ్యరచనా ప్రేరణ కావించిన కౌసల్యా నందనునకే తనకు పోషకుడు ప్రోత్సాహకుడు అయిన చినవేంకటాద్రి కావ్యాన్ని అంకితం చేయమనడం కుమార ధూర్జటికి సంతోషదాయకమై ఉండాలి.

రాయవాచకాన్ని చూడని వారు కుమార ధూర్జటి పై కథనాన్ని చదివినపుడు, అతడు స్వతంత్రంగా, గొప్ప వ్యుత్పత్తితో, కృష్ణ రాయ విజయంలోని ఇతివృత్తాని రూపొందించాడని, కథా కథనాన్ని చేశాడని తలచ డం సహజం. అంతేకాదు; కృష్ణ రాయవిజయము, కుమార ధూర్జటికి ముందు సుమారు నూటయాభై సంవత్సరాల క్రితముండిన చారిత్రకమహా పురుషుడయిన కృష్ణ దేవరాయని చరిత్రలోని విశేషాలను తెలుపుటచే, ఇట్టి చారిత్రక ఇతి వృత్తాలతో కూడిన పద్య కావ్యము ఆంధ్ర వాఙ్మయంలో అరుదగుటచే, ఏ పాఠకుడయినా ధూర్జటి ఈ ఇతివృత్తంలోని వివరాలను సేకరించడానికి చేసిన కృషిని, అతనికి చరిత్ర మీదగల అభిమానాన్ని, అతని చారిత్రక దృష్టిని ప్రశంసించక మానడు. యథార్థానికి, మనకాలంలో,

కృష్ణరాయ విజయమే రాయవాచకాని కంటే ముందు అచ్చయి ప్రచారంలోకి వచ్చింది. కృష్ణరాయవిజయం మొదటి సారిగా 1902లోనే అచ్చయింది.[8] రాయవాచకం, పుదుకోటలో లభించిన రెండు తాళ పత్ర ప్రతులాధారంగా, 1914లో జయంతి రామయ్యపంతులు గారు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో ప్రకటించేదాకా, వెలుగు చూడలేదు ఏ పరిస్థితులలో కాని రాయవాచక ప్రతులు లభ్యంకాక, అది ప్రకటించి ఉండక పోతే, పాఠకులు ఈ నాటికి కుమార ధూర్జటిని, కృష్ణరాయ విజయాన్ని గూర్చి పై అభిప్రాయమే కలిగి ఉండేవారు. ఇట్లా చెప్పడంలో ఉద్దేశం కుమార ధూర్జటి తప్పు చేశాడని చెప్పడంకాదు; అతనికి ముందు ప్రసిద్ధమయి, ప్రచారంలో ఉన్న రాయవాచకం లోని ఇతివృత్తాన్ని, ఇతిహాసాన్ని, వ్యావహారిక వచనంలో ఉన్న దాన్ని, పద్యకావ్యంగా మలిచాడని చెప్పడమే పురాణ ప్రసిద్ధాలు, లేక రామాయణ, మహాభారత ఇతిహాసాంతర్గతాలు అయిన కథా వస్తువులు ఆధారంగా ఆంధ్ర వాఙ్మయంలో ఏర్పడిన కావ్యకల్పనలు కోకొల్లలు. ప్రసిద్ధమయి, ప్రచారంలోకి వచ్చిన చారిత్రక ఇతివృత్తాన్ని పద్యకావ్యంగా రూపొందించే ఆనవాయితీని కుమార ధూర్జటికి ముందే కాసెసర్వప్ప ఏర్పరచి ఉన్నాడని పైన చెప్పాము; అయితే, కాసె సర్వప్ప తన కావ్యాధారమైన మూలగ్రంథాన్ని ప్రకటించాడు; కుమార ధూర్జటి ప్రకటించలేదు.

యథార్థానికి, కుమార ధూర్జటి, రాయవాచకాన్ని ముందుంచుకొని కృష్ణ రాయవిజయాన్ని మలిచాడనే విషయం అద్దంపట్టినట్లు కానవస్తుంది. కృష్ణరాయ విజయంలోని ప్రధాన కథాగమనమంతా రాయవాచకాన్ని యథాతథంగా అనుసరించిందని, ఆ రెంటిని ముందుంచుకొని చదివే ఏ పాఠకుడికైనా తెలుస్తుంది. అంతేకాదు, రాయవాచకంలోని 'పేరా' (Para) లను యథాతథంగా పద్యాలలోనికి అనువదించాడు; కొన్ని వాక్యాలను వీలైనంతవరకు, అట్లే పద్య పాదాలలోనికి సర్దాడు. రాయవాచకాన్ని కృష్ణ రాయవిజయకర్త ఎంత సనిహితంగా అనువదించాడో ఈ క్రింది రెండు ఉదాహరణలు పట్టి ఇస్తాయి.

1) రాయవాచకంలో "తిమ్మరసు రాయలవారిని మందలించుట" అనే శీర్షిక క్రింద ఉన్న పాఠం: "రాయలవారు, సింహాసనపర భారకం వహించే మీ వంటి పెద్దలు వుండగా అట్టి కార్యములు యాలవచ్చీని. మీరు తృణాన్ని బట్టితే మేరువుశాయగలరు. ఆమేరువునే తృణముగా నడిపించగలరు. అఘటన ఘటనా సామర్థ్యములు మీకేగలవు", అని వ్యంగోక్తులుగా ఆనతిచ్చి నందులకు సాళువతిమ్మరసయ్య పలికినది; 'ఆరీతే అవును. అవి యేమి యంటెను స్వామి వారు సకల కార్య భాగ(ర?) ములున్ను (న్ను?) మామీద పూనికె జేసి నడిపించంగా ఆరీతున నడుస్తా వున్నది. చిత్తానకు రాకుంటే మేమనగా తృణ మాత్రం. తృణగ్రాహియయిన యింద్రనీలము ఖ్యాతి బొందును. తృణమని యెంచిగ్రహించక వున్నట్టాయెనా జాతినీలము గాదని వెలతరుగును. అటుగనుక యేలిన స్వామివారి ప్రతాపము వల్లనే గదా కొలిచినవారు ఘన మౌట. కొలిచినవార్లను ఘనముగా నడపగానే యేలిన వారికి కీర్తి ఖ్యాతులు గలుగుట."

దీనికి కుమార ధూర్జటి పద్యానుసరణ:

వ. అనిన నమ్మహీశ్వరుం డతనింగనుంగొని.

క. క్షితి ఘటనాఘటనసమ
ర్థతగల మీ వంటి సత్ప్రధానులు గలుగన్
మతిమాకేల విచారము
సతతమొనర్తుము యథేష్ట సంచారంబున్.

తే. తృణము మేరువొనర్తురు క్షణములోన
మేరువైనను దృణమొను మీర గాద
టన్న సామాజికులకు సామర్థ్యమధిక
మగుట వసుధా ప్రభువుల భాగ్యంబు సుమ్ము.

మ అనుడారాయల వారితోఁ బలికెనయ్యప్పాజి యోస్వామిమే
మనఁగా నెంతటివారమయ్య భవదీయాజ్ఞా విలాసంబులో
ననువొందన్యయ భక్తుల న్మెలఁగి నట్లైనం గృపంజూడుకొ
ల్చిన వారెచ్చటనైన భూపతులకు న్శిక్షార్హులెంచన్ధరన్.

తే. లలిఁద్రుణగ్రాహియైననీలమున కరయ
విలువ యధికంబు తృణమని విడిచినంత
జాతినీలంబుగాదన్న సరణి ధరణి
ప్రభువులు పరిగ్రహించిన ప్రజలు ఘనులు.

ఉ. కావున మీ ప్రతాపమునఁ గాక సమర్థత వేఱె కల్గునా
దేవరవారలిట్లనినఁదెల్పుకొనంగ సమర్థులెవ్వరో
భూవర మీ రలేక్రియను బుద్ధికిఁజెప్పిన నాక్రమంబునన్
దేవసమస్త కార్యములు దీర్చెదరమ్ము పురమ్ము జేరగన్". [10]

2) రాయవాచకంలో "సాళువతిమ్మరసు ప్రశంస" అనే శీర్షిక క్రింద ఉన్న పాఠం:

"అపూర్వమైన మనుష్యులు దొరికితేను సకలమున్ను సంతరించ వచ్చును" అని రాయలదేవుఁడు పలకరించగా అయ్యమరసుగారు విన్నపం జేశినది- "సింహాసనస్థునకు స్త్రీలున్ను రత్నములున్ను కలిగినది అయితే అంతకన్నా అధికం మహీపతుల కనగా-నీతిపద్యం.

క. పత్నిధరిత్రియుఁబురుషులె
రత్నము లెప్పుడుఁ బురంధ్రిరత్నములు శిలా
రత్నము లవనీపతులకుఁ
బత్నులె రత్నములు వగవ బద్దె నరేంద్రా.

అని అన్నారుగనక రాజులైనవారులు అనువైన పురుషరత్నాన్ని సంతరిస్తే ఆయనా నవరత్నములున్ను చతురంగ బలములనున్నా సంత

రించగలడు. అటుగనక అప్పాజి సాధారణ నియ్యోగిగా యెంచవద్దు. ఆయన ఆ సాధారణనియ్యోగి అఘటనఘటనా సామర్థ్యం ఆయనకే గలదు. అవి యేలాగంటేను- అందరున్ను మనుష్యులు, అందరికిన్ని అవయవాలు సరి. ఇందులో ఉత్తములు మధ్యములు అధములు అని యెరిగి యేర్పరచవలెను. అదియేలాగంటేను-గుణాధిక్యము వల్లను యెక్కువ మరిన్ని పంచలోహములున్ను అన్నియుసరి. అందున బంగారు హెచ్చింది యేంది అంటే వొరయకు రాంగా వన్నె హెచ్చించినట్లుగుణాధిక్యంవల్ల మనుష్యులలోనున్న అప్పాజిని అధికుడని యెరుగవలెను. అది యెలాగంటేను-

శ్లో. శతేషుజాయతే శూరః సహస్రేషుచ పండితః
వక్తాశతసహస్రేషు దాతాభవతి వానవ

అనే నీతి ప్రకారానకు నూటికి వకబంటును వెయ్యింటికి వక పండితుడున్ను లక్షకు వఖడు వక్తుండై సభాస్థలిని మాట పలుకులాడును. శీమలో వఖడు దాత అనేది కలండో లేడో అన్నట్టు వొఖరుగాక అందరికిన్ని ఆగుణములు యాల వచ్చెని, అని అయ్యమరసు విన్నపం జేసి ఆప్తాలోచనగా వార్తలాడుతూ వుండగా విజయాపురాన నుండి వేగర్లు వచ్చినారని.........[11]

దీనికి కుమార ధూర్జటి పద్యానుసరణ:

చ. కరచరణాదు లందఱికిఁ గల్గిన యంతటనే సమర్థతన్
మెఱవడిఁగాంచనేర్తురె మనీషివరుల్ ధరలోన నెవ్వరి
క్కరణి ఘటించుచుం గృతయుగంబునఁ ద్రేతనుద్వాపరంబు
నం, దరయఁగ సాళ్వతిమ్మ సచివాగ్రణికిన్సమ మంత్రి కల్గునే

క. ధరలోన మంత్రి రత్నము
నరనాథుడు సంతరించినన్ మణితురగ
ద్విరద వధూజనముల వి
స్ఫురిత గతిన్ గలుగఁజేయు బుద్ధి ప్రౌఢిన్

క. విను పంచలోహములలో
నను బంగారంబు హెచ్చనందగు నటులన్
మనుజులలో సామర్థ్యం
బెనసిన సద్బుద్ధిమంతు నెన్నఁగ వలయున్

ఆ. శతసహస్ర సంఖ్య జనులలో నొక్క శూ
రుండుఁ బండితేంద్రుఁ డుండు టరిది
వక్తయైనవాఁడు వర్ణింపవేవేలఁ
గలుగుటరిది దాత గలఁడొ లేఁడొ

క. అను నట్టిరీతిసీతిన్
ఘన వాగ్జాలతయు సకలకార్య ధురీణ
త్వని రూఢియుఁ గలమంత్రులు
జననాధుని కరుణ గలుగ జగతిం గలరే

క. అని యయ్యమరుసు మొదలుగ
జననాధునితోడ నా ప్తసరసో క్తితతుల్
దనరఁగ బలుకుచునుండఁగ
ననుపమగతి గూఢ చారుఁడా సమయమునన్

ఉ. వచ్చి విజాపురింగలుగువార్తలు దెల్పఁదొణంగె భూవిభుం
డచ్చటి మందియుఙ్........................[12]

రాయవాచకంలోని సంస్కృత శ్లోకాన్ని, బద్దెన నీతి పద్యాన్ని కూడా కుమార ధూర్జటి తనసొంత పద్యాల్లోనికి అనువదించడం గమనించవలసిన విషయం. దీనిని బట్టి కుమార ధూర్జటి కృష్ణరాయ విజయాన్ని రూపొందించడంలో ఎంతదగ్గరగా రాయవాచకంలోవి కథనాన్ని అనుసరించాడో పాఠకులు తెలియగలరు.

ఇట్లు కథాగమనంలో, పద్యానువాదంలో రాయవాచకాన్ని చాలావరకు అతి సన్నిహితంగా అనుసరించిన కుమారధూర్జటి, దానిని 'కృష్ణరాయవిజయ' కావ్యంగా రూపొందించడంలో కొన్ని మార్పులు, చేర్పులు చేశాడు; కొన్ని విషయాలను పరిహరించాడు. రాయవాచక కర్తది చాలవరకు చారిత్రక దృష్టి కృష్ణదేవరాయల పరిపాలనకు, దిగ్విజయాలకు సంబంధించిన విశేషాలను, తన ఎరుకకు వచ్చినట్లు, ఎట్టి వర్ణనలు, అతిశయోక్తులు లేక పాఠకులకు అందజేయడమే రాయవాచకకర్త రచనా ప్రయోజనము. కుమారధూర్జటిది కావ్యదృష్టి, అతడు కల్పనా చమత్కారానికి ఇచ్చిన విలువను చారిత్రక సత్యానికి ఇవ్వలేదు. ఫలితంగా, చరిత్రకారులు ముఖ్యమని భావించే కొన్ని విషయాలను, రాయవాచకంలో చెప్పిన వానిని, వదిలివేశాడు, కొన్నిటిని పద్యాలలో ఒదిగించడానికి వీలుగా మార్చివేశాడు, అసలు రాయవాచకంలోనే లేని విషయాలను కొన్నిటిని కావ్య లక్షణాలకు ప్రబంధనిబంధనలకు అనుగుణంగా చేర్చాడు

రాయవాచకం విజయనగర నిర్మాణ ముహూర్త, శంకుస్థాపనా కాలాలను తెలిపింది, కుమార ధూర్జటి వాని సంగతి యెత్తలేదు. అట్లేరాయ వాచకంలో చెప్పిన వీరనరసింహ రాయల దినచర్య, వోరగంటి ప్రతాప రుద్రుని ప్రసక్తి, గజపతితో గోదావరికడ తురుష్కుల ముట్టడి, గజపతి దిన చర్య, గజపతికి విరోధులు విషప్రయోగము చేయుట, మొదలుగాగల అనేక విషయాలు, చరిత్రకారులకు ఉపయోగ పడేవానిని, కుమార ధూర్జటి వదలి వేశాడు. ఇట్లావదిలి వేసిన విషయాలుగాక, చరిత్ర దృష్టిలో చూచినప్పుడు, మార్చగూడని కొన్ని వివరాలను, తన పద్యాలకు ఒదిగేటట్లు మార్చాడు. రాయవాచకం, విజయనగరస్థాపనాకాలం నుండి వీరనృసింహరాయల కాలం దాక ఇరవై తొమ్మిదిమంది రాజులు పరిపాలించారంటే,[13] ధూర్జటి, "అది మొదలిర్వది పట్టము లిదివఱకు" అని కందపద్యపాదంలో ఒదిగించ డానికి వీలుగా, ఇరవైతొమ్మిదిని ఇరవైగా మార్చాడు.[14] రాయవాచకంలో కన

పడే రాజకీయ వ్యక్తుల పేర్లు కొన్ని కృష్ణరాయవిజయంలో కానరావు, ఫీనిలో కొన్ని పేర్లను మార్చాడు. అంతేగాదు, రాయవాచకాన్ని సరిగా అనుసరించక వీరనరసింహరాయల తమ్ముడు, అతని వారసుడు అయిన కృష్ణదేవరాయలను అతని పుత్రునిగా పేర్కొని, కుమారధూర్జటి తనకుగల చారిత్రక దృష్టిలో పాన్ని పూర్తిగా తెలిపాడు.[15] కుమార ధూర్జటి, ఈ తప్పును తెలిసి చేసినా, తెలియక చేసినా, ఖండవల్లి లక్ష్మీరంజనంగారన్నట్లు. "తనకు అందుబాటులో గల కావ్య, శాసనాదులను పరిశీలింపక, సరియగు చరిత్రాంశములను తెలిసి కొనక, కుమార ధూర్జటి కృష్ణదేవరాయలు వీరనరసింహ రాయని పుత్రుడ నుట అసంగతము. నరసానాయకునకే వీరనరసింహ రాయలుగా కవి పేర్కొనెనని కొందరిమతము"[16] కుమార ధూర్జటి నరసానాయకుని వీర నరసింహుడను కొనుటకు ఆస్కారము లేదు,ఇది అశ్రద్ధఅనే చెప్పవలె.అరుణ కుమారిగారన్నట్లు, "కవి అశ్రద్ధ చూపినను పొరపాటు పడినను క్షమింపరాని నేరమే. ఇదికేవలము కావ్యము కాదు. చారిత్రకకావ్యము"[17] ఈ విషయాన్నే పురస్కరించుకొని, చాగంటి శేషయ్యగారు"ఈగ్రంథము చరిత్రకారులకంతగా నువయోగ పడదు ఇది ప్రబంధ దృష్టిలో రచియింప బడినదికాని, చారిత్రక దృష్టిలో వ్రాయబడినది కాదు......... ఇతరాధారములవలన నిశ్చయమై ననే తప్ప, కృష్ణరాయ విజయమునందలి యంశములు సత్యములని చరిత్ర కారులు భావింపరాదని తలంచుచున్నాడను" అన్నారు.[18] రాయవాచకాన్ని, కృష్ణరాయ విజయాన్ని ఆధార గ్రంథాలుగా తమ చారిత్రక గ్రంథాలలో విస్తారంగా ఉపయోగించిన విజయనగర చరిత్ర చతురాననులు నేలటూరు వెంకట రమణయ్యగారు, ఇలా అన్నారు. కుమార ధూర్జటి కృత కృష్ణరాయ విజయము పద్యకావ్యము. కాని దీనినొక ప్రత్యేక స్వతంత్ర చరిత్రాధారగ్రంథముగ దలచుటకు వలను పడదు. మధురనాయకుల ప్రస్తావనయందుగాన రాకపోయినను రాయవాచకమున కిది పద్యప్రతి. కొన్ని సందర్భములందు రాయవాచకమును ముందుంచు కొనిన గాని సుబోధముగాదు. కుమార

ధూర్జటి యుద్దేశము కృష్ణరాయల విజయములను మాత్రమే వర్ణించుట యగుట వలన రాయవాచకమందలి యన్యాంశముల నాతడు విడిచి పుచ్చెను."[19] ఆరుద్ర, చాగంటి శేషయ్యగారి అభిప్రాయంతో ఏకీభవిస్తూనే, "రాజకీయ చరిత్ర కిది తోడ్పడక పోవచ్చును గాని సాంఘిక చరిత్రకు కొంత పనికి వస్తుంది సురవరం ప్రతాపరెడ్డిగారీ గ్రంథాన్ని (ఆంధ్రుల సాంఘిక చరిత) లో కొంత వాడు కొన్నారు"[20] అన్నారు. అరుణకుమారిగారు పై శేషయ్య, ఆరుద్రగారల అభిప్రాయాలకు కొంత భిన్నంగా ఇట్లన్నారు. "ఏదో ఒకటి రెండు చారిత్రక విషయములు చరిత్రకు భిన్నముగ నున్నంత మాత్ర మున ఈ కావ్యము చరిత్ర కారులకు ఉపయోగపడదని ఘంటా పథముగ చెప్పుట, కావ్యమును వీరు చరిత్ర దృష్టితోకాక, కావ్యదృష్టితో పరిశీలించి నటులతోచుచున్నది. చరిత దృష్టితో చూచిన కృష్ణరాయ విజయము నందును మనకు పెక్కు రాజకీయ, సాంఘిక విషయములు తెలియును ............ ఆరుద్రగారు అనినటుల 'చరిత్రకు సైతం అంతంత మాతంగా' కాక ఈ గ్రంథము, విజయనగర చరిత్రను తెలుసు కొనుటకు, చరిత్ర కారులకు మిక్కిలి తోడ్పడును.[21]

మనకు రాయవాచకము, కృష్ణరాయ విజయము రెండూ లభ్యమవు చున్నపుడు, చరిత్ర శోధకుడు చరిత రచనకు, సంయోజనానికి రాయవాచ కాన్ని ప్రధాన ఆధారంగా గ్రహిస్తే, సత్యానికి కొంతచేరువగా ఉండగలడు. కృష్ణరాయవిజయాన్ని రాయవాచకానికి సహాయభూతంగా, అనుబంధంగా, పరిశిష్టంగా మాత్రమే వాడుకోవలె సాంఘిక చరిత్ర తెలుసు కోవడానికి రాయ వాచకానికన్నా కృష్ణరాయ విజయం కొంత ఎక్కువ ఉపయోగపడుతుంది. ఉదాహరణకు రాయవాచకం ఆరాధ్యులను, వైష్ణవులను నామమాత్రంగా చెప్పింది.[22] కృష్ణరాయవిజయంలో వారి వేషభాషలు, నడవడికలు కుమార ధూర్జటి చాలాచక్కగా వర్ణించాడు. అట్లే యుద్ధంలో ఓడిన తురకల ప్రవర్త

నను వర్ణించాడు. కృష్ణరాయల, గజపతితనయ వివాహ వర్ణనా సందర్భంలో కొన్ని పెండ్లి ఆచారాలను పేర్కొన్నాడు. వీనిని సమకాలిక వేషభాషలకు, ప్రవర్తనలకు, ఆచారాలకు ప్రతిబింబాలుగా గ్రహించవచ్చు.

కుమారధూర్జటి రాయవాచకంలో లేని వర్ణనలను కొన్నిటిని దానిని కృష్ణరాయవిజయ కావ్యంగా రూపొందించడంలో, సందర్భోచితంగా, ఔచిత్య పూర్ణంగా, కావ్యలక్షణాను సారంగా చేర్చాడు. వీనిని గూర్చి కావ్య వైశి ష్ట్యాన్ని గూర్చి చెప్పేటప్పుడు ముచ్చటిస్తాము.

## కవి ఊరు, పేరు, కులము, గోత్రము

కుమార ధూర్జటి కృష్ణరాయ విజయ కర్త బిరుదనామము ఇతని కుమారుడు లింగరాజకవి తాను రచించిన పెద కాళహస్తి మాహాత్మ్యములో తన తండ్రిని గూర్చి 'ధూర్జటి వంశపాథోధి చంద్ర కుమార ధూర్జటి నామ విస్ఫూర్జితాంక స్తుతిమతి వేంకటపతి' అని ఈ విషయమును తెలిపి ఉన్నాడు.[23] ఇందుమతీ పరిణయ ఆశ్వాసాంత గద్యలోకూడా "కుమార ధూర్జటి ప్రఖ్యాత నామాంక వేంకటార్య" అని ఉంది.[24] కుమార ధూర్జటి అసలు పేరు వెంకటార్యుడు. కృష్ణరాయ విజయంలోని ఈ క్రింది పద్యంలో కుమార ధూర్జటి తన కులగోత్రాదులను గూర్చిన వివరాలు ఇచ్చాడు.

నను భరద్వాజ గోత్రుని సదాపస్తంబ
సూత్రుని బాంధవ స్తోత్ర పాత్రు
పాకనాటార్వేలవంశ ప్రసిద్ధుని
ధూర్జటి పౌత్రు బంధుర చరిత్రు
సద్గురు కారుణ్య సంప్రాప్త విద్యావి
హారుని శ్రీకాళహస్తి నిలయ
చిత్ప్రసూనాంబికా శ్రీశ్వరానుగ్రహా
సాదిత కవితాకసజ్జహృదయు

సార రచనాధురీణుఁ గుమార ధూర్జ
టిప్రధానాగ్రగణ్యుఁ బటీరహీర
మహిత సత్కీర్తి కాళయామాత్య పుత్రు
వేంకటార్యునిఁ బిలిపించి వేడ్కననియె.[25]

ధూర్జటి వంశస్థులందరికి కాళహస్తీశ్వరుడు, జ్ఞాన ప్రసూనాంబికా ఇష్ట దైవతములగుటచే, వారి స్వగ్రామము కాళహస్తి అయి ఉండవలె. కృష్ణరాయ విజయ ఆశ్వాసాంతగద్యను బట్టి కుమార ధూర్జటి ఓరుగంటి కాశీపతికి శిష్యుడని, కాళయామాత్య లక్ష్మాంబికలకు ఔరసపుత్రుడని, పోలన మంత్రి గుర్వమాంబికలకు దత్తపుత్రుడని తెలుస్తుంది. కుమార ధూర్జటి గురువైన ఈ కాశీపతిని గూర్చి ఎట్టి వివరాలు దొరుకలేదు. కుమార ధూర్జటిని కృష్ణరాయ విజయ రచనకు ప్రోత్సహించిన ఆరవీటి చినవెంకటపతి ఏ ప్రాంతంలో రాజ్యాధికారాన్ని నెరపుతుండినాడో తెలియదు. కుమారధూర్జటి ఎప్పటి నుండి అతని ఆశ్రితుడయినాడో కూడా తెలియదు. ఇందుమతీ పరిణయం వ్రాసి నూజివీటి ప్రభువైన నరసప్పారావుకు అంకిత మివ్వక ముందే ఆరవీటి చినవెంకట పతిని, లేక అతని తండ్రి కోదండ రామరాజును ఆశ్రయించి ఉండినాడో, లేక ఇందుమతీ పరిణయ రచన తర్వాతనే చినవెంకట పతిని ఆశ్రయించినాడో తెలుసుకొనుట కాధారాలులేవు.[26] కాని ఇందుమతీ పరిణయం వ్రాసేనాటికి ఇతడు 'దాక్షిణాత్య కవి'గా అనగా దక్షిణ దేశయాంధ్ర కవిగా ప్రసిద్ధు డయినాడని, ఇతనిని ఉద్దేశించి కృతినేత నరసాప్పారావు పలికిన 'దాక్షిణాత్య కవులు...'[27] అనే దాక్షిణాత్యకవుల ప్రశంస తెలుపుతుంది.

## కుమార ధూర్జటి కృతులు

కుమార ధూర్జటి కృష్ణరాయ విజయము వ్రాసే నాటికి వయసులో చిన్నవాడని, ధూర్జటిని ఆకావ్యరచనకు ప్రోత్సహిస్తూ ఆరవీటి చినవెంకటాద్రి పలికిన ఈ క్రింది మాటలవల్ల తెలుస్తుంది.

క. బాలుఁడవయ్యును విద్యా
శీలుఁడవు గభీరమధుర శృంగార కళా
లాలిత చాతుర్య కవి
త్వాలోచననిపుణ వేంకటామాత్యమణీ.[28]

అయితే కృష్ణరాయ విజయ రచనోద్యోగం నాటికి ముందే కుమార ధూర్జటి సావిత్రి చరిత్రము, ఇందుమతీ వివాహము లేక పరిణయము అనే రెండు కావ్యాలను చేసి వున్నట్లు, కృష్ణరాయవిజయంలోనే చినవెంకటాద్రి నోట పలికించిన ఈ ప్రశంస తెలుపుతుంది.

ఉ. చిత్రముగాఁగఁ జిన్నపుడె చేసితి వేరసముల్ చెలంగ సా
విత్రి చరిత్రముఁ మిగులవేడుక నిందుమతీ వివాహముఁ
స్తోత్రమొనర్పన ర్హమగు సూక్తిగతిఁ రచియించితౌఁ గదా
ధాత్రిఁ బ్రసిద్ధి గాంచితివి ధన్యుఁడ వౌర కుమార ధూర్జటీ.[29]

పై రెండు పద్యాల్లో "బాలుఁడవయ్యును" "చిన్నపుడె" అను పదాల అర్థాన్ని మనం యథాతథంగా గ్రహించక, యౌవనప్రాంగణంలో ఉన్నప్పుడు అనగా ముప్పది సంవత్సరాలలోపు వయస్సులో అని అర్థం చేసుకోవలసి ఉంటుంది. కృష్ణరాయ విజయ రచనా కాలాన్ని గూర్చి చర్చించేటప్పుడు, ఈ పదాల సూచితార్థాన్ని గూర్చి ఆలోచిస్తాం.

## కుమార ధూర్జటి కాలము :

కుమార ధూర్జటి కాలము ఆతనిని ఆదరించిన ఇద్దరు ప్రభువుల కాలాన్ని నిర్ణయించడం మీద ఆధారపడి ఉంది. వీరిలో మొదటివాడు నూజ వీడు ప్రభువైన నాగసింహాప్పారాయడు. ఇందుమతీ పరిణయ కృతి ప్రేర కుడు, కృతిభర్త ఇందుమతీ పరిణయంలో, ఇతడు "రమ్యచారిత్ర! విజయాప్ప రాయపౌత్ర! వేంకటాద్ర్యప్పరాయ భూవిభుపుత్ర!......... నారసింహప్ప

రాయ" అని సంబోధింప బడుటచే, ఇతని తండ్రి వేంకటాద్ర్యప్పరాయడని, తాతవిజయాప్ప రాయడని విదితము.[30] ఇందుమతీ పరిణయ పరిష్కర్తల యిన తిరుపతి వేంకటేశ్వర కవులు, వారి పీఠికలో ఈ నరసింహప్పరాయని కాలాన్ని, కుమారధూర్జటి కాలాన్ని చర్చించారు. కందుకూరు వీరేశ లింగం పంతులు, "కృష్ణరాయ విజయము 1550 సంవత్సర ప్రాంతమునందు రచియింపఁబడి యుండును. ఈ కవియు 1560-70 సంవత్సరముల వఱకు జీవించి యుండునని యూహింప దగియున్నది అన్నారు[31] తిరుపతి వేంకటేశ్వర కవులు. వీరేశలింగంగారి అభిప్రాయాన్ని కాదనడంతో తమ కాల చర్చ ప్రారంభించారు. నూజవీడు యెస్టేటు విభాగపు జడ్జిమెంటు ఆధారంగా దానిలో చెప్పిన కాలాన్నను సరించి, నరసింహాప్పారావు గారి పితామహు లయిన విజయాప్పారావుగారు ఫసలీ 1077 లేక క్రీ.శ. 1667లో రాజ్యానికి వచ్చినట్లు' తిరుపతి వేంకటేశ్వర కవులు నిర్ణయించారు. కాని ఈ కాలాన్ని కుమార ధూర్జటి, కృష్ణరాయల కాలం (క్రీ శ 1508-1530)లో ఉన్న పెద ధూర్జటికి మనుమడు అని కృష్ణరాయవిజయ, ఇందుమతీ పరిణయాలలో చెప్పి ఉన్న విషయంలో సమన్వయించలేక, వీరు గురుజాడ రామమూర్తిగారు పొరపాటుకులోనై, కృష్ణదేవరాయలు 1577 వరకు రాజ్యం చేసినాడని చెప్పిన విషయాన్ని సమర్థించడం, 'లేదా జడ్జిమెంటులోని 1667, అనునది ప్రమాదమనియేని యనుకోవలను. జగ్గకవి కాల నిర్ణయమును బట్టి చూచిన జడ్జిమెంటు సరిపోవుచున్నది. పరిశీల నలింకను విచారించి నిజమును గనుఁ గొనఁగోరుచున్నారము' అని చెప్పటం జరిగింది[32] ఇక్కడ చెప్పిన జగ్గకవి 18వ శతాబ్ద మొదటిపాదంలో ఉన్నట్లు కవి చరిత్రకారు లందరూ అంగీక రించిన కూచిమంచి జగ్గకవి, తిట్టు పౌత్రమైన చంద్రరేఖా విలాపకర్త, నర సింహాప్పా రావుగారే కృతినందిన "అప్పారాయయశశ్చంద్రోదయ" కర్త యగు అణివెళ్ల వెంకటశాస్త్రి సమకాలికుడు. తిరుపతి వెంకటేశ్వరులు పేర్కొన్న పై జడ్జిమెంటులో చెప్పిన కాలము సరి అని క్రింద తెలుస్తుంది.

నరసింహప్పారావు ఈ విజయప్పారావుకు రెండవతరములోని వాడుకాబట్టి ఇతని కాలము (1667 + 25) = 1692 నుండి 18వ శతాబ్ద ప్రథమ పాదము వరకు చెప్పవచ్చును. ఈ గణన ఇతరచరిత్రా ధారాలతో సమన్వయించి, సరిపోవుచున్నది.

"నానారాజన్య విఖ్యాత చరిత్రకారులగు శ్రీరామ్ వీరబ్రహ్మకవిగారు నూజవీడు సంస్థాన చరిత్ర వ్రాయుచూ నరసింహాప్పారావు గారి పితామహు లైన విజయాప్పారావు గారిని గురించి ఇట్లు తెలిపినారు. "ఈ యప్పన్న క్రీ శ. 1667వ సంవత్సరములో గోలకొండ నవాబు నొద్దనుండి యా కాలం బున రాజోచిత చిహ్నంబులగు డంకా, నగారా నౌబత్, జాలందరు పల్లకి మున్నగు గౌరవాదులను గాక 'విజయు' డను ప్రసిద్ధనామము సార్ధకమగు నటుల 'రాజా, బహదర్, అప్పారావు తహవ్వర్, వజులాలత్ దస్తుగహ'అను బిరుదములను బొందిరి'.[33] ఈ 'విజయ' అప్పారావే నూజవీడు దుర్గప్రతి ష్ఠాపకులు. ఈవిజయాప్పారావుగారి పుత్రులయిన వేంకటాద్రప్పారావు గారిని గూర్చి వ్రాసిన తర్వాత, వేంకటాద్రప్పారావు కుమారులు, ఇందుమతీ పరిణయకావ్య కృతిభర్త, కుమార ధూర్జటి పోషకుడు అయిన నరసింహప్పా రావును గూర్చి శ్రీరామ్ వీరబ్రహ్మకవి ఇట్లు తెలిపినారు. "శ్రీరాజానరసింహ ప్పారావుగారి కాలములో నన(గా క్రీ.శ. 1707వ సంవత్సరములో ఢిల్లీ పాదుషా యగు నౌరంగజీబు గతించుటచే పాదుషా పక్షమున హైదరాబాదు నేలుచున్న ధైర్యపరాక్రమ హీను(డగు సుబేదారు(డు దూరస్థసామంత రాజన్యులను దనస్వాధీనములో నుంచు కొనలేక పోయెను. కావున మన శ్రీరాజానరసింహాప్పారావు బహదరు గారికి 'తీన్‌హజార్ మన్ సర్దార్' అను బిరుదమొస(గి వలసినప్పుడు మూ(డు వేలసైన్యముతో(దమకు సాహాయ్యార్థ ముగ రాగల సామంత రాజునిగ( జేసికొనెను. ఇదియే వీరు పాలించుచున్న పరగణాలపై నైజామునకు వచ్చు ప్రతిఫలము."[34]

ఆరుద్ర కుమార ధూర్జటి కాలనిర్ణయ విషయంలో కొంత ఇబ్బంది పడినారు. ఆరుద్ర నరసింహాప్పారావును గురించి, "విజయాప్పారావు...... క్రీ శ. 1597లో గోదావరీ తీరాన జరిగిన సోనపుత్ర యుద్ధంలో మరణించారు వీరి మనవడు నరసప్పారావుగారు 1627" అని, ధూర్జటి కవులకాలాలను ఈ క్రింది విధంగా క్రోడీకరించారు.

1. కుమార ధూర్జటి 1630 క్రీ.శ.
2. లింగరాజు 1655 క్రీ.శ.
(కుమార ధూర్జటి పుత్రుడు)
3. ధూర్జటి వెంకటరాయుడు 1680 క్రీ.శ.
(కుమార ధూర్జటి పుత్రుడు
లింగరాజు పుత్రుడు)

కాని తరువాత, కొండపల్లి ఏలూరు సర్కారుల సంస్థానాల సాహిత్య పోషణను, 'అప్పారాయ యశశ్చంద్రోదయ' కర్త ఆణివెళ్ల వెంకటశాస్త్రిగారు గూర్చి వ్రాస్తూ, పైకాలనిర్ణయం సరికాదని ఇలా వ్రాశారు.

"సాహిత్య పోషణ చేసిన నూజ్వీటి ప్రభువులలో మేకా నరసప్పారావు గారు ప్రముఖులు. ఈయన నూజవీడు నగరాన్ని నిర్మించిన ఇమ్మడి విజయ అప్పారావు గారి మనుమడు. క్రీ.శ. 1698 తరువాత నరసప్పారావుగారు తఖ్తుమీదకు వచ్చారు. ఈయన దిట్టకవి పాపరాజు అనే కవికి పెద్దమద్దాలి గ్రామంలో 150 కత్తుల మాన్యం ఇచ్చారు. ఆకవి 'రామకథాసార సంగ్రహం' రచించాడు. కుమార ధూర్జటికి కూడా నరసప్పారావుగారే పోషకులు. నూజ పీటి వంశావళిలో ఇద్దరు విజయాప్పారావులు ఉన్నారు. వాళ్లలో రెండోవాడి మనుమడే నరసప్పారావు అని తెలియక పూర్వం తప్పులెక్క కట్టేను. మొదటి విజయ అప్పారావుగారి మనువడి కాలంలో కుమార ధూర్జటి ఉన్నా

డనుకొని ఆ కవిని పోయిన యుగంలో చేర్చాను...... నరసింహప్పారావు గారు...... వల్లూరుపల్లెను అగ్రహారంగా ఆణివెళ్ల వారికి ఇచ్చారు. ఇది క్రీ.శ. 1735లో దానం చేసినట్లు కనబడుతుంది. ఈ దానమిచ్చిన కొద్ది కాలానికి నరసప్పారావు గారు పోయి ఉండాలి"[36]

పై చర్చల, వాదాల సారాంశం కుమార ధూర్జటి పోషకులు, ఇందుమతీ పరిణయ కృతినేత అయిన నరసప్పారావుగారి కాలం క్రీ.శ. 1698 నుండి 1735 వరకు అని చెప్పడమే.

ఇందుమతీ పరిణయమే కుమార ధూర్జటి మొదటి కావ్యమనుకోవాలి. కృష్ణరాయ విజయ రచనోద్యోగం నాటికి, సావిత్రీ చరిత్రం, ఇందుమతీ పరిణయం వ్రాసినట్లు అందుకో సాక్ష్యం ఉంది. ఇందుమతీ పరిణయంలో సావిత్రీ చరిత్రాన్ని పేర్కొనలేదు. కాని నరసప్పారాయడు కలలో కలిగిన దైవప్రేరణ మీద కృతినాయకత్వం వహించ నిశ్చయించుకొన్న తర్వాత "శ్రుతిమధుర సూక్తిఁదగు సత్కావ్యం బొనరింపజాలు కవి నింపొనరఁగ ధర వెదకి" "ధూర్జటి వంశాబ్ధిందుని" "కుమార ధూర్జటి" ని "బిలువంబనిచి" అతనితో

క. దాక్షిణాత్యకవులు ద్రాక్షేక్షు మధురసమాధురీ ధురీణ మహితదివ్య
భవ్యకావ్యరవ్యపటువాచ్చమత్కార పటిమఁ దనరినట్టి ప్రౌఢులంద్రు"

చ. తెలుగునఁ జెప్పనేర్చిన సుధీజనులెల్ల సెబాసు! ధూర్జటీ
బళి! యని దిక్కు గుల్కవగఁ బాటిలు తేటమెఱుంగు మాటలఁగ
మెళుకువ గాంచు బెళ్కు జిగిమించు ప్రబంధతతుల్ ఘటింతువాఁ
బలుకులముద్దరాలిమిహి బంగరుటందె రవల్ సెలంగఁగఁ."[37]

అన్నట్లు ఇందుమతీ పరిణయంలో చెప్పి ఉంది. పై పద్యాన్ని బట్టి నరసప్పారావు ధూర్జటిని తన వద్దకు పిలిపించి కొనే నాటికి, అతడేదో సుధీ

జనులు మెచ్చే సత్కావ్యాలు వ్రాసినట్లుంది. వానిలో, పేరు చెప్పకపోయినా సావిత్రీ చరిత్ర ఉండి ఉండవచ్చు. అందువల్ల ఇందుమతీ పరిణయాన్ని నరసప్పారావు రాజ్యానికి వచ్చిన తర్వాత అయిదారు ఏండ్లలోపల కుమార ధూర్జటి వ్రాశాడను కొంటే, అది క్రీ.శ. 1700-1705ల మధ్య వ్రాసి ఉండాలి. సావిత్రీ చరిత్ర దీని తర్వాత వ్రాసిందైతే క్రీ.శ, 1710 లోపల వ్రాసి ఉండాలి. ఈ రెంటి తర్వాత వ్రాసిన కృష్ణరాయ విజయం క్రీ.శ.1710 ప్రాంతంలో వ్రాసి ఉండవచ్చు. కుమార ధూర్జటి "చిత్రముగాగ జిన్నపుడె" సావిత్రి చరిత్రను,ఇందుమతీ పరిణయాన్ని వ్రాసినాడని చెప్పిన దానినిబట్టి,[38] కృష్ణరాయ విజయం వ్రాసే నాటికి కూడ, కృష్ణరాయ విజయం వ్రాయమని ప్రోత్సహించిన వెంకటపతి అతనిని "బాలుడవయ్యును" అని సంబోధించడాన్ని బట్టి,[39] కృష్ణరాయ విజయ రచనా కాలం (క్రీ.శ, 1710 ప్రాంతం) నాటికి కుమార ధూర్జటికి 30 ఏండ్లు దాటి ఉండవని, 25-30 సంవత్సరాల వయసులో ఉన్నవాడని అనుకోవచ్చు. ఈ వయోనిర్ణయానికి ఇంకొకఉపపత్తి కూడాఉంది. ఇందుమతీ పరిణయ గద్యలో కుమార ధూర్జటి తనను "కాశయామాత్య లక్ష్మమాంబా కుమార కుమార ధూర్జటి"[40] అని మాత్రమే చెప్పుకొన్నాడు. కాని కృష్ణరాయ విజయ రచనా కాలం నాటికి తాన దత్తుపోయినట్లు తెలుపుతూ, దాని గద్యలో "కాశయామాత్యలక్ష్మంబికాదత్త పోలన మంత్రి గుర్వమాంబికా కుమార ధూర్జటి" అని చెప్పుకొన్నాడు. సామాన్యంగా ఇరవై అయిదేండ్లు పైబడిన వానిని దత్తుతీసు కొనడం సంప్రదాయముకాదు, పై చర్చను బట్టి క్రీ.శ.1680 ప్రాంతంలో కుమారధూర్జటి జన్మించాడని, తన 20-25 ఏండ్ల మధ్య అనగా క్రీ.శ. 1700-1705ల మధ్య ఇందుమతీ పరిణయం, సావిత్రీ చరిత్ర వ్రాశాడని, 1705-10ల మధ్య అనగా 25, 30 ఏండ్ల మధ్య కృష్ణరాయ విజయ కావ్యరచన చేసి ఉంటాడని భావించడం సమంజసమై ఉంది.

పై కాలనిర్ణయానికి, కృష్ణరాయ విజయ కృతి ప్రేరకుడయిన ఆర్వీటి చినవెంకటాద్రి కాలం కూడా సరిపోతుంది. ఈ చినవెంకటాద్రి కాలనిర్ణయ విషయంలో చాలమంది చరిత్రకారులు, కవిచరిత్ర కారులు పొరపాటు చేశారు. ఏలనో కందుకూరి వీరేశలింగం పంతులు ఈ ఆర్వీటి చిన వెంకటాద్రిని, ఆకువీటి చిన వెంకటాద్రిగా పొరపడినాడు.[41] కృష్ణరాయ విజయంలో, పొర పడుట కవకాశంలేకుండా, పలుతావుల, ఇతడు ఆర్వీటి చిన వెంకటరాయడనే పేర్కొన బడ్డాడు. కుమార ధూర్జటి తన కావ్యముల ఆశ్వాసాంత గద్యలలో, అవతారికా పద్యాలలో తనను 'ధూర్జటి పౌత్ర' అని చెప్పుకొన్నది ఆధారంగా వీరేశలింగం, కృష్ణరాయ విజయం 1550 ప్రాంతంలో రచింపబడి ఉంటుం దని, కుమార ధూర్జటి 1560-70 ల వరకు జీవించి ఉండునని భావించారు.

విజయనగర చరిత్ర చతురాననులైన నేలటూరు వెంకటరమణయ్య గారు, ఏలకో, ఈ ఆర్వీటి చిన వెంకటపతిని కర్ణాట సామ్రాజ్యాధీశుడయిన మూడవ"వెంకట పతిరాయల తమ్మునిగా పొరపడి, "ఇది (కృష్ణరాయ విజ యము) క్రీ.శ. 1630-1642ల మధ్య కర్ణాటక సామ్రాజ్యమును పాలించిన ముమ్మడి వెంకటపతి రాయల కాలమున రచింపబడెను"[44] అని అభిప్రాయ పడినారు. బహుశా, 'ధూర్జటి పౌత్ర' అనే కుమార ధూర్జటి విశేషణమే వెంకటరమణయ్య గారి ఈ అభిప్రాయానికి కారణమై ఉండవచ్చు.

యథార్థానికి ఈ ఆర్వీటి చిన వెంకటపతి మూడవ వెంకటపతిరాయల తమ్ముడుకాదు, ఈ మూడవ వెంకటపతి రాయలతమ్ముని మనుమని కుమారుడు. కృష్ణదేవరాయల కాలంలో ఉన్న అళియ రాయలనుంచి లెక్కవేస్తే అళియ రామరాయల మనుమని మనుమడు, విజయనగర రాయలలో చివరివాడని చెప్పదగ్గ మూడవ శ్రీరంగరాయల (క్రీ శ. 1642-1673/80) తమ్ముడైన వెంకటపతి మనుమడు; కోదండ రామరాజు కొమారుడు. ఈ కోదండరామ రాజు మూడవ శ్రీరంగ రాయల (క్రీ.శ. 1680) తర్వాత నామమాత్రావ

శిష్టంగా ఉన్న విజయనగర సింహాసనానికి వారసుడైన వాడు. ఈ కోదండ రామరాజుకు, పోచిరాజు కృష్ణమరాజు కుమార్తె అయిన నాంచారమ్మకు కలిగిన వాడే కృష్ణరాయ విజయ కావ్య ప్రేరకుడు, కుమార ధూర్జటి పోషకుడు అయిన ఆర్వీటి చినవెంకటపతి; అతని రెండవ కుమారుడు. ఈ విషయాన్నే, కోదండరామరాజుకు 'నరపతి విజయాన్ని' అంకితం చేసిన అద్దంకి దుగుల వెంకయ్యకవి,

క. ఘనుడగు రామనృపాలుఁడు
కనె నాంచారమ్మవలన, గడుమోదముతో
డను జిన వేంకటపతి నృప
వన జాహితు రాజవంశ వర్ధను ననఘున్[45]

అని చెప్పాడు, కుమార ధూర్జటి, 'రామపృధ్వీరమణ సాధ్వీమణి నాంచారమాంబాగర్భ శుక్తి ముక్తాఫలంబు అని చినవెంకటపతిని వర్ణించాడు.[46] అందువలన, మూడవ శ్రీరంగరాయల (1642-1680) తర్వాత రెండవ తరంలో ఉన్నవాడైన ఈ ఆర్వీటి చినవెంకటపతి కాలం, 1680 + 25 = 1705 అనగా 18వ శతాబ్ద ప్రథమ పాదంలో అని రూఢిగా చెప్పవచ్చు. ఇందువల్ల కుమార ధూర్జటి పోషకులు, కావ్యరచనా ప్రేరకులు అయిన నూజివీడు ప్రభువు నరసప్పారావు గారు, ఆర్వీటి చిన వెంకటపతి సమకాలికు లని తేలి మనము ఇద్దరి విషయంలో చేసిన కాలగణన సరిపోతున్నది.

కాని ఇచ్చట ఒక చిక్కు ఏర్పడుచున్నది. కుమార ధూర్జటి పలుమారు తనను గురించి 'ధూర్జటి పౌత్రు' డని చెప్పుకొని ఉన్నాడు.[47] ఆశ్వాసాంత గద్యలలో, ఎడనెడ, అవతారికా పద్యాలలో ధూర్జటి పౌత్రుడనని చెప్పి ఉన్నాడు. నిజముగా కుమార ధూర్జటి, కృష్ణదేవ రాయల కాలం (1509-1530)లో ఉన్న, కాళహస్తిమాహాత్మ్య కర్త అయిన, ధూర్జటి పుత్రుని పుత్రుడయి ఉన్న, పై కాలగణన సరిపోదు. కాని, కుమార ధూర్జటి మాట

వరుసకు తనను తన పూర్వులలో ప్రసిద్ధుడయిన ధూర్జటి పౌత్రుడుగా చెప్పుకొన్నాడే గాని, యథార్థముగా, పరంపరలో నేరుగా, ధూర్జటి కుమారుడు కాదని కృష్ణరాయ విజయములో ఆర్వీటి చినవెంకటపతి పలికిన ఈ క్రింది పద్యము సూచించును.

చ. స్తుతమతియైన యాంధ్ర కవిధూర్జటి పల్కులకేల్లుగల్గెనో
యతులిత మాధురీ మహిమ నాము మీ పెదతాత చాల స
న్నుతిఁగనెఁ గృష్ణరాయల మనోజ్ఞసభన్ వినుమీవు నట్లుమ
త్కృత బహుమాన వైఖరులఁ గీర్తివహింపుము ధాత్రిలోపలన్.[48]

ఈ పద్యములో ధూర్జటి, కుమార ధూర్జటి 'పెదతాత'గా చెప్పబడ్డాడు, అనగా కుమార ధూర్జటి, ధూర్జటి తమ్ములలో ఒకని కుమారుని కుమారుడని చెప్పుకొనవలె. అయినప్పటికిని, ధూర్జటికి రెండవ తరములోని వాడుగనే కుమారధూర్జటి వచ్చును పైన మనము చేసిన కాలగణన సరిపోదు. అందుచే, ఈ 'పెదతాత' అను పదమున కర్థము, చాగంటి శేషయ్యగారు చెప్పినట్లు 'తాతకుతాత' అని చెప్పుకొనవలసి యుండును. అప్పుడు కుమార ధూర్జటి, ధూర్జటికి మనుమని మనుమడగును. ఆర్వీటి చిన వెంకటాద్రి అళియరామరాయల మనుమని మనుమని కుమారుడని పైనచెప్పితిని అప్పుడు చాగంటి శేషయ్యగారు చెప్పినట్లు, అళియ రామరాజును ధూర్జటియు కృష్ణదేవరాయల కాలములోనివారు. అతని మనుమని మనుమని కుమారునకు, నీతని మనుమని మనుమఁడు కావ్యమును గృతి యిచ్చెననిన నంతవ్యత్యాసము గనుపట్టదు ...... కుమార ధూర్జటి తనయుఁడైన లింగకవి తన తండ్రిని వర్ణించునప్పుడు 'ధూర్జటి వంశ పాథోధి చంద్ర కుమార ధూర్జటి' యనియెనే కాని ధూర్జటికిఁ దమ్ముని మనుమఁడని చెప్పక పోవుట కూడ పైయూహకు బల మొసంగుచున్నది.'[49] కాని ఇంత చర్చ జరిపి, ఆర్వీటి చిన వెంకటపతిని సరిగా కోదండ రామరాజు పుత్రునిగా గుర్తించి, చాగంటి శేషయ్య

గారు ఏలనో కాల సమన్వయము చేయలేక, వారు చేసిన వాదానికే విరుద్ధంగా, "కావునఁ గుమార ధూర్జటి పదునేడప శతాబ్ద పూర్వార్ధమున ననగా 1640-1650 ప్రాంతమున నీ కావ్యమును రచియించెనని నిశ్చయింతము" అని నిష్పాదించారు.[50] దీనికి కారణము. ఇందుమతీ పరిణయ కావ్యమును వారు చూచివుండక పోవుట కావచ్చును. కాని మనము పైన చేసిన కాలగణన ప్రకారము కుమార ధూర్జటి కావ్యరచనాకాలము 18వ శతాబ్ద ప్రథమపాదము (1700-1725), లేక ఇంకను దగ్గరగా చెప్పిన మొదటి దశకము (1700-1710) అంగీకారమగునేని, అందుగుల వెంకయ్య 'నరపతి విజయ' రచనా కాలముగా చాగంటి శేషయ్య. ఆరుద్రలు చెప్పిన క్రీ.శ, 1630 కొంతమార్చ వలసి ఉండును.[51] ఇట్లే కుమార ధూర్జటి పుత్రుడైన లింగకవి కాలము, పౌత్రుడైన వెంకటరాయకవి కాలము సరిదిద్ద వలసి ఉండును.

## కుమార ధూర్జటి కృతులు - పూర్వముద్రణలు :

కుమార ధూర్జటి కృతులలో సావిత్రీ చరిత్రము లభ్యమయినట్లు లేదు, అది నేటికి అచ్చయినట్లు తెలియదు. ఆంధ్ర వాఙ్మయసూచిక (1924) ముద్రిత గ్రంథముల పట్టికలోలేదు, అందులోనే ఇచ్చిన వివిధ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారముల (ఆం.సా. పరిషత్, తంజావూరు, చెన్నపట్టణం) అముద్రిత గ్రంథముల పట్టికలోలేదు. తంజాపురాంధ్ర నాయకరాజైన రఘు నాథ రాయల కృతమని చెప్పిన 'శృంగార సావిత్రి', లేక సావిత్రి చరిత్ర, కుమార ధూర్జటి చిన్నప్పుడే రచించి యెవ్వరికి కృతి నీయకుండ ఉంచిన 'సావిత్రీ చరిత్ర'మై ఉండవచ్చునని నిడుదవోలు వేంకటరావుగారు ఒక అను మానమును వెలిబుచ్చినారు.[52] సావిత్రీ చరిత్ర ఉనికి కృష్ణరాయ విజయంలో దానిని పేర్కొన్నందు వలన మాత్రం తెలుస్తున్నది.

ఇందుమతీ పరిణయం'అభినవ సరస్వతీ' పత్రికలో మొదట ముద్రింప బడి, నూజవీడు జమీందార్ల ప్రోత్సాహంతో, తిరుపతి వేంకట కవులు పరి

ష్కర్తలుగా, గుంటూరు నుండి, 1914లో, పునర్ముద్రిత మయ్యింది. ఇది నూజవీడు పాలకులలో ఒకరైన నరసింహప్పారాయనికి అంకితము. ఆంధ్ర వాఙ్మయసూచిక ముద్రిత గ్రంథముల పట్టిక (పు.22)లో, 1912లో ముద్రితమయినట్టు చెప్పి ఉంది. బహుశా, 'అభినవసరస్వతి'లో అయిఉండ వచ్చు.

కృష్ణరాయ విజయము రాజామంత్రి ప్రగడ భుజంగరావు గారి పత్రిక "మంజువాణి"లో మొదటగా ముద్రితమై, వారి చేతనే 1902లో, ఏలూరు నుండి, పుస్తక రూపంలో పునర్ముద్రింప బడింది. అముద్రిత గ్రంథ చింతామణి పత్రికా సంపాదకులు, అధిపతులు అయిన పూండ్ల రామకృష్ణయ్యగారు, అముద్రిత గ్రంథ చింతామణి 1904 మార్చి సంచికలో ఈ ముద్రణను గూర్చి చెప్పి ఉన్నారు. ఈ ముద్రణ సంపాదకులు, పరిష్కర్తలు అయిన రాజ భుజంగరావుగారు పీఠికలో ఇట్లు చెప్పారు : "ఇట్టి సద్గ్రంథమీ చెంతల నెక్కడ నలవడమిం జేసి నేను చెన్నపురి రాజధానియందు 'ఓరియెంటల్ లైబ్రరీ'లో నుండ వచ్చునను తలంపుతోఁ బ్రత్యేక మందు నిమిత్తమయి యచ్చటికి వెడలి దైవానుగ్రహమున నిదియందు లభించుటచే వ్రాయించి తెచ్చి ముద్రింపించితి." ఆంధ్ర వాఙ్మయ సూచిక (1924) ముద్రిత గ్రంథ ముల పట్టికలో దీనిని చూపించలేదు.

కృష్ణరాయ విజయానికి రెండవ ముద్రణ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి గారు పరిష్కర్తగా 1914లో జరిగినట్లున్నది, దీనిలో విశేషాలను ఎరుక పరచుటకు, ఈ ముద్రణ ప్రతి నాకు లభ్యం కాలేదు. దీనిని ఆంధ్ర కవి తరంగిణి, సంపుటము. 12లో చాగంటి శేషయ్యగారు పేర్కొన్నారు. పరిష్కర్త పేరు లేకుండా ఆంధ్ర వాఙ్మయసూచిక- ముద్రిత గ్రంథముల పట్టిక (పు 44)లో ఇవ్వబడిన కృష్ణరాయ విజయ మిదే అయి ఉండవచ్చు. Sources of vijayanagar History (1919)లో కృష్ణరాయ విజయంలోని

చారిత్ర కాంశాలను ఆంగ్లంలోనికి అనువదించి, చివర ఒక గమనికలో "The Original is not given here for considerations of space The work has been published and is available to the public" అని ఈ ముద్రణను గూర్చి తెలిపినట్లున్నది.

1929లో, వావిళ్ళ రామస్వామి అండ్ సన్స్‌వారు, మద్రాసునుంచి పంచాగ్నుల దక్షిణా మూర్తి శాస్త్రిగారి రెండుపుటల విజ్ఞాపనంతో, కృష్ణ రాయ విజయాన్ని ముద్రించారు. దక్షిణామూర్తి శాస్త్రి కావ్యానికి సంబంధించి ఎట్టి విషయ విమర్శ చేయలేదు. కాని పాఠ పరిష్కరణ చక్కగా చేసి, "యీ యుత్తమ గ్రంథమును జక్కని పరిశ్రమచేఁ దగినంత వ్రాఁత ప్రతుల తోడు పాటున దిద్ది చక్కఁజేసితిని" అని తెల్పినారు. అయితే వీరుకూడ, ఆరవీటి చినవెంకటాద్రిని, 'ఆకువీటి చిన వెంకటాద్రి' అన్నారు.[52b]

రాయవాచకానికి మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో రెండు వ్రాత ప్రతులున్నాయి. ఒకటి, D. 2603 కాగితప్రతి: 120 పుటలు, గ్రంథము పూర్తిగా ఉంది. రెండవది. D. 2603, తాళపత్ర ప్రతి, 98 పుటలు, వ్రాత సరిలేదు.

ఈ ముద్రణ :

ఈ ముద్రణకు 1929లో వావిళ్ళ వారు ప్రకటించిన ముద్రణ ప్రతి మూలప్రతి (Vulgate) గా గ్రహించబడింది: ఈ వావిళ్ళ ముద్రిత ప్రతిని 1902లో రాజా భుజంగరావు ముద్రించిన ప్రతితో సరిచూచినాను, రెండింటి లోని పాఠములు, పొరపాటున దొర్లిన అచ్చు తప్పులు మినహాయిస్తే, సరి పోతున్నవి. వావిళ్ళ వారి ముద్రణ ప్రతి నిర్దుష్టంగా ఉంది.

## కావ్యవైశిష్ట్యము :

చరిత్రను తెల్పుటే ప్రధాన ప్రయోజనంగా, ఎట్టి వర్ణనలు, కల్పనలు లేక రచించిన రాయవాచకం లోని ఇతి వృత్తాన్ని చంపూప్రక్రియలో

కావ్యంగా మలచడంలో కుమార ధూర్జటి ఆ ఇతి వృత్తంలో కొన్ని పరి హరింపులు, మార్పులు, దానికి కొన్ని చేర్పులు చేశాడని పైన చెప్పాము. వీనిలో పరిహరింపులను, మార్పులను గూర్చి పైనచెప్పి ఉన్నాం. ఇప్పుడు కుమార ధూర్జటి చేసిన చేర్పులను గూర్చి ప్రస్తావిస్తాం. కుమార ధూర్జటి ఈ చేర్పులనంతా ప్రబంధయుగంలో ప్రాచుర్యంలో ఉన్న కావ్య లక్షణానుసా రంగా చేశాడు. నాటి ప్రబంధనిబంధనల ననుసరించి ఈ చేర్పులను ప్రవేశ పెట్టాడు. 'అష్టాదశ విశిష్టవర్ణనములు గలుగవలయు మహాకావ్యతిలకమునకు' అని చెప్పి 'కావ్యాలంకార సంగ్రహ'కారుడు ఈ క్రింది విధంగా వానిని పేర్కొన్నాడు.

క. పురసింధునగర్తువిన శశి
సరసీవనమధురతి ప్రసంగ విరహముల్
పరిణయ తనయోదయ నయ
విరచన యాత్రాజి దౌత్యవిభువర్ణనముల్.[53]

"ఇందు నొకకొన్ని కడమైన నెంచి చూడ నదియు నవని మహాకావ్య మనఁగ బరఁగు" నన్నాడు.[54] కృష్ణరాయవిజయ కావ్యనిర్మాణంలో, పై చెప్పిన అష్టాదశవర్ణనలలో, సింధు, మధుప్రసంగ, తన యోదయ వర్ణనలు విడిపిస్తే, మిగిలిన అన్నిటికి కుమార ధూర్జటి తన కావ్యంలో చోటు కల్పిం చాడు. రాయవాచకం కృష్ణదేవరాయల దిగ్విజయవృత్తాంతాన్ని తెల్పేది కాబట్టి యుద్ధవర్ణనకు మాత్రం అవకాశమిస్తుంది. ఇతర వర్ణనల ప్రసక్తి రాయ వాచకంలో లేదు ఈ వర్ణనలన్నీ కుమార ధూర్జటి స్వకపోలకల్పితాలే. ఈ వర్ణనలను ప్రవేశ పెట్టడంలో అతడు కొంత కల్పనా చాతుర్యాన్ని చూపిం చాడు, కాని వర్ణనలు చేయడంలో ప్రతిభావ్యుత్పత్తులు లోపించాయి. ఉదాహర ణకు కథా ప్రారంభంలో చేసిన విజయనగర పురవర్ణన చరిత్ర పరంగా చూచినా, కవితాపరంగా చూచినా పేలవమైనది.[55] విదేశీయులు వేనోళ్ళపొగడి

అతి విపులంగా వర్ణించిన, సమకాలిక ప్రపంచంలో పేరు ప్రఖ్యాతులు గాంచిన ఈ మహానగరాన్ని, దాని వైభవాన్ని వర్ణించడంలో కుమారధూర్జటి విఫలుడైనాడు. తన ప్రతిభావ్యుత్పత్తుల ప్రదర్శనకు కలిగిన చక్కని అవకాశాన్ని వినియోగించుకోలేక పోయాడు. ఇచట అతడు చేసిన చాతుర్వర్ణ్య వర్ణన, వారకామినుల వర్ణన, గజ, హయ వర్ణనలు,పుష్పలావికల నర్మోక్తులు పాతమూసలలో దించిన నిస్సారపు అనుకరణలు.

కృష్ణరాయ విజయంలోని నాల్గవ ఆశ్వాస మంతా ధూర్జటి స్వకపోల కల్పితమే.[56] కృష్ణదేవ రాయలతో గజపతి కొమార్తెకు జరిగిన వివాహానికి సంబంధించి రాయవాచకంలో, ఎట్టి వర్ణనలులేని, 22 పంక్తుల కథనం ఆధారంగా, తన కల్పనా చాతుర్యంతో ఈ నాల్గవ ఆశ్వాసాన్ని ధూర్జటి సృష్టించాడు. [57] పైన చెప్పిన అష్టాదశవర్ణనలలో చాలా వానిని, శృంగార రస ప్రధానమైన వానిని, చేయడానికి అవకాశం ఏర్పరచుకొన్నాడు. రాయవాచకంలో 'జగన్మోహిని' అని చెప్పిన గజపతి తనయ పేరుకు కుమార ధూర్జటి 'తుక్కా' అని పేర్కొన్నాడు. మిక్కిలి ఔచిత్యంతో నాయకుడయిన కృష్ణరాయల మధ్య, నాయిక అయిన గజపతి తనయ మధ్య చిలుక రాయబారం ఏర్పరచి, దానిచేత నాయిక అంగాంగ వర్ణన చేయించాడు. ఈ చిలకకు చక్కగా 'మోహన వాణి' అనిపేరు పెట్టాడు. సూర్యోదయ, సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనలు, నాయికా నాయకుల విరహవర్ణనలు, 'విధు మదనులను సమీరణ శుకకోకిలల మధుకరంబును' నిందించుటలు, వసంతవర్ణన, జలక్రీడ, వనవిహారం, పెండ్లి తతంగం, పడకటింటి సంభోగ శృంగారం వీటి నన్నిటిని సంప్రదాయ బద్ధంగా ఈ నాల్గవ ఆశ్వాసంలో కుమారధూర్జటి ప్రవేశపెట్టాడు కొన్నిచోట్ల 'వసుచరిత్ర' కారుని అనుకరించినా, ఈ వర్ణనలు కొన్ని హృదయంగమంగా ఉన్నాయి. ఉదాహరణకు వసంత వర్ణన (IV. 42), వనవిహార వర్ణన (IV. 49) పేర్కొనవచ్చును.

కుమార ధూర్జటి తన కవితా గుణవైశిష్ట్యాన్ని గూర్చి ఆరవీటి చిన వెంకటపతి నోట చెప్పించి ఉన్నాడు. చినవెంకటపతి కుమార ధూర్జటిని "గభీర మధుర శృంగార కళాలాలిత చాతుర్య కవిత్వాలోచన నిపుణు" డన్నాడు[59] "రసార్థ గూఢ రూఢ వాగ్ఘటి" యన్నాడు.[60] "దళ్కుగుల్కువగ బాటిలు తేట తెనుంగుమాటలఁ మెలకువఁగాంచు బెళ్కు జిగిమించఁ బ్రబంధములఁ"[61] "జక్కని మాట లెంతయు రసస్థితి ముందఱబాఱుదీఱఁగాఁ జక్కెర లొల్కఁ దేనియలు సారెకుఁ జిల్కఁగ భవ్యకావ్యముల్" చెప్ప నేర్తువన్నాడు[6] కుమార ధూర్జటి తాను 'విన్నవింప బూనిన కృష్ణరాయ విజయం' 'మహాప్రబంధ' మన్నాడు.

కృష్ణరాయ విజయ మందలి కవితా గుణ వైశిష్ట్యాన్ని గూర్చి పండితులు వివిధాభిప్రాయాలను వ్యక్త పరచి ఉన్నారు కందుకూరి వీరేశలింగం గారు "ఈతని కవిత్వము మృదుమధుర వాక్య రచనాధురీణమయి కర్ణరసాయనముగా నుండును" అని ఉదాహరణగా 11-3,59, 111-76, IV.130 పద్యాలను ఇచ్చారు.[64] చాగంటి శేషయ్యగారు, "ఈతని కవిత్వము కవి చెప్పినట్లు మృదుమధుర పద సంయుతమై ద్రాక్షాపాకమున మనో హరముగా నున్నది. ధూర్జటి కవిత్వమునందువలెనే రేఫ ద్వయమైత్రి ఇకార సంధి మొదలగు ప్రయోగము లిందును గలవు" అని, శైలి తెలియుటకై, I. 51, II.18 III. 66 IV 103. ఉదాహరించారు.[65]

అరుణకుమారిగారు కృష్ణరాయ విజయమందలి వర్ణనల గూర్చి, రసాన్ని గూర్చి కొంత విపులంగా విశ్లేషించి ఇట్లు ప్రశంసించారు "కుమార ధూర్జటి వర్ణనలు మిక్కిలి సహజముగా నున్నవి. ఈతడు చక్కని కల్పనలతో, పరిశీలనా దృష్టితో మనోరంజకముగ వర్ణనలు చేసెను. పురవర్ణన, తరులతాదుల వర్ణనము చక్కగ నున్నవి... ఈ పద్యము (IV. 42) నందు మనకు వసంతకాలము ప్రకృతి కనులముందు క్రమక్రమ పరిణామము పొందుచున్నటుల కన్పడు చున్నది."

"చంద్రోదయ అస్తమయములు, సూర్యోదయ వర్ణనములందు కవి యుక్క రచనా నైపుణ్యము, భావుకత, నిశితమగు పరిశీలనా తత్త్వము విశద మగుచున్నది. చీకటులను ఛేదించుకొని, క్రమక్రమముగా, వర్ణములు మారుచు నుదయించెడి సూర్యుని వర్ణనము, చిత్రకారుని చేతి యందలి తూలికా విన్యా సమును ధిక్కరించుచున్నది.

"ఈతని స్త్రీ వర్ణనము పూర్వకవుల కెంతమాత్రము తీసిపోలేదు. చతుర్థాశ్వాసమున తుఖ్కా అంగాంగ సౌందర్యమును పదునొకండు పద్య ములలో వర్ణించెను ద్వితీయాశ్వాసమున లక్ష్మీదేవి స్వరూపవర్ణనము చక్కని పదముల కూర్పులో రమ్యముగ సాగినది. చంద్ర దూషణ మన్మథ దూష ణాదుల వర్ణనలు సందర్భమునకు సరిపడు వృత్తముల నందముగ సాగినవి.

"ఈ కవి రసపోషణము కూడమేలుగ నున్నది. సర్వ సాధారణముగ చారిత్రక కావ్యములందు వీరరస ముండును. ఈ వీరము యుద్ధవీరము, దానవీరము, దయావీరము, ధర్మవీరము మొదఁగు ఇరువది నాలుగు వీరము లుగ విభజింపబడినది. ఇందు ఏదేని ఒక వీరము అంగముగ ఉండును.కొన్ని కావ్యముల వీరము అంగిగను శృంగారము అంగముగను రచింపబడినవి. కుమార ధూర్జటి ఈ కావ్యమున వీరరసము అంగిగ పోషించెను. ఈ కావ్యము నందలి నాయకుడైన కృష్ణదేవ రాయలు వీరుడు. అతని కడనున్న సామంత నృపతులు వీరులు...... కృష్ణరాయని పాత్ర పోషణమునందు త్యాగవీరమును, దయావీరమును, దానవీరమును చక్కగ పోషించెను. యుద్ధవర్ణనయందు శబ్దాదులను భయాలాపాదులను వ్యక్తము చేయుటకు ప్రాసలను అనుప్రాసలను సమయానుకూలముగ ఉపయోగించి చమత్కార మగు భావ ప్రకటనము గావించెను. ఈ కవి వీర రసపోషణకై ఎక్కువగ పంచచామర వృత్తము నెన్నుకొనెను. ఈ వృత్తము కదను త్రొక్కునటు లుండును కనుక యుద్ధవర్ణనలకు అతికినట్లు సరిపోవును.

వరాకు రాకు రాకు మంచుఁ బారసీక భూపతుల్
చిరాకు మీఱ దట్టమైన సింగణీలకోరులన్
జిరాగుఱాల వేసి డాసి చిల్లువొల్లు జేయుచున్
నిరాకరించి మెంచి వచ్చు నేర్పుఁ జూచితే నృపా
(కృ.రా. 111.30.)

ఈ పద్యమున కదనోత్సాహము, ప్రతాపము వెల్లడి యగుచున్నవి. ఈతని రచన యందు కొంత హాస్య రసమును గలదు. కృష్ణరాయలు రణ రంగమునకు రాగా తురుష్కులు పడిన పాట్లు నవ్వు పుట్టించును.

"శృంగార రసపోషణము నందును ఈ కవి ప్రబంధ కవులకు తీసి పోలేదు. సర్వసాధారణముగ కవులు ఒడలు మరచి శృంగార వర్ణనలు చేయుట మనకావ్యములందు కనిపించును. ఈ కవికూడా అదను చూచుకొని కృష్ణరాయల వివాహ సందర్భమున శృంగార రసమును చిప్పిల జేసెను "ఇట్టి రమణీయములైన వర్ణనములతో, సరళమైన శైలితో,సరసమగు భావము లతో అతి రమ్యముగ రచించి '.........సారసా హిత్య సౌహిత్య సరణి వెలయు వర్ణన లొనర్తు రమణీయ వాక్యములను' (పీఠిక ప. 11) అను మాటలు సత్యములని నిరూపించు కొనినాడు కుమార ధూర్జటి."[6]

ఆరుద్ర పై అభిప్రాయాలకు విభిన్నమయిన అభిప్రాయం వెలి బుచ్చాడు. ఆరుద్ర అభిప్రాయంలో "చరిత్రకు సైతం అంతంత మాత్రంగా పనికి వచ్చే ఈ గ్రంథం సాహిత్యంలో పెద్ద పీటలు నోచుకొనదు. పద్యాన్ని బాగ నడిపించినా ప్రతిభ ఏమీ ప్రత్యేకంగా ఇందులో కనబడదు. అనుకరణలో కూడా కుమార ధూర్జటి రాణించలేదు. భట్టుమూర్తి చెప్పిన ఈ క్రిందిపద్యం సుప్రసిద్ధం.

'మహిమ న్వాగను శాసనుండు...... దత్ప్రాగల్భ్యమూహించెదన్'
(వసుచరిత్ర, 1.10)

ఇందులోని విశేషాలను తీసుకొన్నా ాషలను కడవరకూ కుమార ధూర్జటి కొన సాగించలేక పోయాడు.

'వాక్యాసనుఠదను వాని...... రమణీయ వాక్యములను'
(కృష్ణరాయ విజయం 1. 11)

కుమార ధూర్జటి బాల్యంలో వ్రాసిన గ్రంథం కాబట్టి ఇందులో ప్రతిభ రాణించ లేదను కోడానికి వీలులేదు. ఇంతకన్నా చిన్నతనంలో వ్రాసిన 'ఇందుమతీ పరిణయం' చక్కగా ఉంది.[67]

కుమార ధూర్జటి కొన్ని లాక్షణిక విరుద్ధ ప్రయోగాలు చేశాడు:

ఉదా : సళ్లించు ( I. 53 )- సడలించు
కావుకావను ( III. 61 )- కావుకావుమను
పడుకింటి ( VI. 131 )- పడుకటింటి

కాని, మిగిలిన దాక్షిణాత్య కవులు తమ కావ్యాలలో చేసిన లాక్షణిక విరుద్ధ ప్రయోగాలను చూచినపుడు, కృష్ణరాయ విజయంలో ఇట్టి ప్రయోగాలు చాలా కొద్ది మాత్రమేనని చెప్పాలి.

కృష్ణరాయ విజయంలో చాలా ఉర్దూ, ఫారశీ అన్యదేశ్యాలు కనబడతాయి. వీనిలో ఏ అయిదారో మినహాయిస్తే. మిగిలిన వన్నీ రాయవాచకంలో వాడినవే. నేను ఆం.ప్ర. సాహిత్య అకాడమీ వారికి పరిష్కరించి ఇచ్చిన రాయవాచకంలో ఈ పదాలకు విపులమైన వివరణ ఇచ్చి ఉన్నాను, జిజ్ఞాసువులు రాయవాచకాన్ని చూడ ప్రార్థన. ఒకే ఇతి వృత్తం గల రాయవాచక వచన కావ్యాన్ని, కృష్ణరాయ విజయం పద్యకావ్యాన్ని సాహిత్య జిజ్ఞాసువులు, చరిత్ర పరిశోదకులు తులనాత్మకంగా పరిశీలించడం అవసరం.

కృష్ణరాయ విజయాన్ని పరిష్కరించే అవకాశం కల్పించిన ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి నా కృతజ్ఞతలు తెలుపు కొంటున్నాను.

వ్రాత ప్రతులను గురించి నా జాబులకు ఓపికతో వెనువెంటనే జవాబులిచ్చి సహాయపడిన సాహితీ మిత్రులు, చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తక భాండా గార పండితులు, తీర్థం శ్రీధర మూర్తిగారికి నా నెనరులు, నమస్సులు.

'ప్రమాణ సిద్ధాన్తవిరుద్ధ మత్ర
యత్కించి దుక్తంమతిమాంద్యదోషాత్,
మాత్సర్యముత్సార్య తదార్య చిత్తాః
ప్రసాదమాధాయ విశోధయన్తు॥'

1 నవంబర్, 1980
నెల్లూరు

సి. వి. రామ చంద్రరావు.



## ఉపయుక్తగ్రంథాలు, పత్రికలు


అరుణకుమారి. బి: ఆంధ్రవాఙ్మయమున చారిత్రక కావ్యములు (17వ శతాబ్దం వరకు), వాల్తేరు' 1978.)

ఆరుద్ర : సమగ్ర ఆంధ్ర సాహిత్యం, సంపు.IX X, XI, XII, 1966మొ॥

ఏకామ్ర నాధుడు : ప్రతాప(రుద్ర) చరిత్రము, నరేంద్రనాథ సాహిత్య మండలి, తణుకు, 1969

కాసెసర్వప్ప : సిద్ధేశ్వర చరిత్రము

కుమార ధూర్జటి : (i) ఇందుమతీ పరిణయము (తిరుపతి వేంకటేశ్వర పరిష్కృతము), గుంటూరు,1914)

(ii) (a) కృష్ణరాయ విజయము, (సం. రాజా యం. భుజంగరావు) ఏలూరు, 1902;

(b) (పరిష్కర్త : పంచాగ్నుల దక్షిణామూర్తి శాస్త్రి) వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ మద్రాసు, 1929.)

గుస్టావ్ ఆపర్ట్ : (GUSTAV OPPERT Ed.) రామరాజీయము లేక (నరపతి విజయము), మద్రాసు, 1898)

దోణప్ప, తూమాటి ; ఆంధ్రసంస్థానములు-సాహిత్యపోషణము, వాల్తేరు 1969

మూర్తికవి : కావ్యాలంకార సంగ్రహము, వావిళ్ళరామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, మదరాసు, 1969.

లక్ష్మీరంజనం ఖండవల్లి : ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము.

విశ్వనాధ నాయని స్థానాపతి : "రాయవాచకము."

(i) (పరిష్కర్త : జయంతిరామయ్య పంతులు), ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక. 1914, తృతీయ సంపుటము, పు. 11-40, 49-64, 125-136, 175-182, 207-210 లు.

(ii) (సం. జయంతి రామయ్య పంతులు) ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక ప్రచురణ సంఖ్య. 33, కాకినాడ, 1933.

(iii) (పరిష్కర్త : సి. వి, రామచంద్రరావు), ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు.

వీరేశలింగం పంతులు- కందుకూరి : ఆంధ్ర కవుల చరిత్రము, చెన్నపురి, 1899.

వెంకటరమణయ్య నేలటూరు : కృష్ణదేవరాయలు, హైదరాబాదు, 972.

వేంకటరావు నిడుదవోలు : దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము,మద్రాసు1962

శేషయ్య, చాగంటి : ఆంధ్ర కవి తరంగిణి, సం.పు. VII, XI, XII.

శ్రీరామ్ వీరబ్రహ్మ కవి : నానారాజన్య విఖ్యాత జనచరిత్ర, మచిలీపట్టణము 1920.

పత్రికలు :

అముద్రిత గ్రంథ చింతామణి, నెల్లూరు (సం. పూండ్ల రామకృష్ణయ్య)

ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, కాకినాడ.

# సూ చి క లు

1. చూడు 'రాయవాచకము' (పరిష్కర్త : సి.వి. రామచంద్రరావు) ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ (ప్రచురణ)
2. క్రింద, "కుమార ధూర్జటి కాలము" చూచునది.
3. 'సిద్ధేశ్వర చరిత్రము' ఆశ్వా. II, 6-9, పు.22
4 'కృ.రా వి' I. 13-16
5. 'అదే', I. 16-20.
6. 'అదే' I. 22, 30, 31
7. 'అదే' I. 33, 36, 41
8. క్రింద, "పూర్వముద్రణలు" అను శీర్షిక క్రింద చూచేది.
9. 'రాయవాచకము' పుట. 39, పంక్తులు. 8-21
10 'కృ.రా.వి' II. 87-92
11. 'రాయ వాచకము', పు. 45. పంక్తి 8 నుండి పుట. 46 పంక్తి. 12 వరకు.
12. 'కృ.రా.వి.', II. 104-110.
13. 'రాయవాచకము', పు. 15
14. 'కృ.రా.వి', II. 35
15. 'అదే' II. 38, 45, 82, 142
16. ఖండవల్లి లక్ష్మీరంజనం, 'ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము' పు. 200

17. బి. అరుణ కుమారి, 'ఆంధ్ర వాఙ్మయమున చారిత్రక కావ్యములు' పు. 175-176లు.

18. చాగంటి శేషయ్య, 'ఆంధ్ర కవితరంగిణి' XII, పు. 86-87

19. నేలటూరు వెంకటరమణయ్య, 'కృష్ణదేవరాయలు' పు. 3

20. ఆరుద్ర, 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' X, పు. 202

21. అరుణ కుమారి,'ఆంధ్ర వాఙ్మయమున చారిత్రక కావ్యములు' పు.198

22. 'రాయవాచకము', పు. 3

23. చాగంటి శేషయ్య, 'ఆంధ్ర కవి తరంగిణి', XII, పు. 253. "ధూర్జటి లింగరాజు"

24. తిరుపతి వేంకటేశ్వర కవులు(పరిష్కర్తలు),'ఇందుమతీ పరిణయము' నాల్గవ ఆశ్వాసాంత గద్య : "శ్రీమదఖండ సచ్చిదానంద కాశీపతి సద్గురు స్వామి చరణారవింద సేవాసమాగత స్వస్వరూప జ్ఞానరాజ యోగ సామ్రాజ్య లక్ష్మీ ధురంధర జ్ఞాన ప్రసూనాంబికా కాళహస్తీశ్వర కరుణా కటాక్ష వీక్షణ సంప్రాప్త సార సాహితీ బంధుర బంధు రంజన చరిత్ర ధూర్జటి పౌత్రకాళయామాత్య లక్ష్మమాంబికా కుమార కుమార ధూర్జటి ప్రఖ్యాత నామాంక వేంకటార్య ప్రణీతంబైన యిందుమతీ పరిణయంబను మహాప్రబంధంబునందు జతుర్థాశ్వాసము"

మిగిలిన ఆశ్వాసాంత గద్యలలో 'కుమార ధూర్జటి' అని మాత్రమే ఉంది. "ప్రఖ్యాత నామాంక వేంకటార్య" అనే పదాలు లేవు.

25. 'కృ.రా.వి', I. 2?

26. చూడు క్రింద, శీర్షిక, "కుమార ధూర్జటి కాలము"

27 "ఆ. దాక్షిణాత్య కవులు ద్రాక్షేక్షు మధురస

మాధురీ ధురీణమహిత దివ్య

భవ్య కావ్య నవ్య పటు వాక్చమత్కార
పటిమఁ దనరినట్టి ప్రౌఢులంద్రు"
—ఇందుమతీ పరిణయము, I. 32.

28. 'కృ.రా.వి', I. 24

29. 'అదే', I. 25

30. 'ఇందుమతీ పరిణయము' I. 41

31. వీరేశలింగం, 'ఆంధ్ర కవుల చరిత్రము' పు. 240.

32. 'ఇందుమతీ పరిణయము' ఉపోద్ఘాతము.

33. శ్రీరామ్ వీరబ్రహ్మకవి, 'నానారాజన్య విఖ్యాత చరిత్ర' పు. 5

34. 'అదే' పు. 9

35. ఆరుద్ర, 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం', X, పు. 203-204లు,పు 211

36. ఆరుద్ర, అదే, XII, పు. 205-206 లు

37. 'ఇందుమతీ పరిణయం' I. 27, 30, 31, 32, 34 పైన పేర్కొన్న పద్యాల్లో చివరిదైన "తెలుగునఁ జెప్ప నేర్చిన...... బంగరు టందె రవల్ సెలంగఁగన్" అనే పద్యాన్ని కుమార ధూర్జటి మరల కృష్ణ రాయ విజయం (I-27)లో ఉద్ధృత మొనర్చాడు. కృ.రా.వి.లో ఇది "తెలుగునఁ జెప్ప నేర్చితి..." అని ప్రారంభ మవుతుంది.

38. 'కృ.రా.వి' I. 25

39. 'అదే' I. 24

40. చూడు పైన సూచిక. 24

41. వీరేశలింగం, 'ఆంధ్ర కవుల చరిత్రము' పు. 238

42. 'కృ.రా.వి', I. 1, 2, 41, II. 1, 154; IV 1, 143

43. వీరేశలింగం, 'ఆంధ్ర కవుల చరిత్రము, పు. 240
44. నేలటూరు వేంకటరమణయ్య, 'కృష్ణదేవరాయలు' పు. 3
45. GUSTAV OPPERT (Ed.) 'నరపతి విజయము, పు.81, పద్యం.450
46. 'కృ.రా.వి' I, వచ. 20
47. చూడు పైన సూచిక 24; 'కృ రా.వి' I. 23,
48. కృ.రా.వి, I, 29 'ఇందుమతీ పరిణయం' (I. 12)లో కుమార ధూర్జటి, పెద ధూర్జటిని గూర్చి చెప్పిన ఈ పద్యం గమనించ తగ్గది.

సీ. ఏ భూసుర శ్రేష్ఠుఁడిలలోనఁ బేరొందెఁ గాళహస్తి మహత్వ
కథ యొనర్చి

నే బుధాగ్రణి కథల్ హేరాళముగఁ గూర్చి రహిఁ బ్రమదా
డంబరం బొనర్చి

నే యంధ్ర కవి కృష్ణరాయ భూపాలకు నద్భుతంబుగఁ దేల్చె
నాత్మమహిమ

నే రమ్యగుణ శాలి శ్రీ రాజ యోగసుజ్ఞాన సద్గురు సేవ
సంతరించె

గీ. నమ్మహాత్మ 'మదీయ వంశాబ్ధి చంద్రుడైన' ధూర్జటి కవిరాజు
... నభినుతింతు

ఇందుమతీ పరిణయం (I. 31) లో కూడా "నను ధూర్జటి వంశాబ్ధిందుని" అని మాత్రమే చెప్పుకొన్నాడు ఖచ్చితమైన బాంధవ్యమును చెప్పలేదు.

49. చాగంటి శేషయ్య. 'ఆంధ్ర కవి తరంగిణి' **XII**. 85-86 లు, పు **VII**, పు.
50. 'అదే' పు. 86
51. చాగంటి శేషయ్య, 'ఆంధ్ర కవి తరంగిణి' **XI**, ఆరుద్ర, 'సమగ్ర ఆంధ్ర, సాహిత్యం, **X**, పు. 195.

52. నిడుదవోలు వెంకటరావు, 'దక్షిణదేశీయాంధ్ర, వాఙ్మయము' పీఠిక, పు.50..

52. (ఎ) బహుశాపీరు 1929, వావిళ్ల ముద్రణకు, విజ్ఞాపన వ్రాసిన పంచాగ్నుల దక్షిణామూర్తి శాస్త్రియే అయి వుండవచ్చు, బాగంటి వారు పొరపాటున ఈపేరును ఆదినారాయణ శాస్త్రి అని వ్రాశారని అనుమానము.

52 (బి) పైనసూచనలు. 41, 42 చూచేది.

53. కావ్యాలంకార సంగ్రహము, II. 165, 166.

54. 'అదే' 167,

55. కృ. రా. వి, I, 43-56. కుమార ధూర్జటి మరొక రెండు పద్యాలలో, (II. 31, 34), విజయనగరాన్ని వర్ణించి ఉన్నాడు. దీనిలో II, విజయనగర పరిసరాలను కొంతైనా చెప్తుంది. రెండవది. చక్కని సీసపద్యం, లయాన్వితమైనది.

56. రాయవాచకంలో ఆశ్వాసవిభజనగాని, అధ్యాయాల విభజనగానిలేదు .

57. 'రాయవాచకము' పు. 109 పంక్తి 12 నుండి పు. 110. పంక్తి 12 వరకు

58. కృ. రా. వి, IV. 98

59. అదే, I . 24

60. అదే, I . 25

61. కృ.రా.వి, I . 27. చూడుపైన సూచన. 37

62. కృ.రా.వి, 28

63. 'అదే' I. 42

64. వీరేశలింగం, 'ఆంధ్రకవుల చరిత్రము' పు. 240

65. చాగంటి శేషయ్య, 'ఆంధ్రకవితరంగిణి' XII. పు. 87

66. అరుణ కుమారి, 'ఆంధ్రవాఙ్మయమున చారిత్రక కావ్యములు' పు. 197-198 లు

67. ఆరుద్ర, 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' X, పు. 202-203.



శ్రీ ర స్తు

# కృ ష్ణ రా య వి జ య ము

## పీఠిక

శా. శ్రీసీతాసతితోడఁగూడి భువన క్షేమంకరప్రక్రియో
ల్లాసం బొప్పఁగ లోకకంటకుల నెల్లం ద్రుంచి సత్కీర్తులన్
భాసిల్లన్ రఘువీరుఁ డెంతయును సంపత్ప్రీతి రక్షించువి
శ్వాసద్వైఖరి నారివీటి చినరాజశ్రీమహారాయనిన్. 1

సీ. జగదధిష్ఠానభాస్వజ్జ్యోతి యగువాఁడు
బ్రహ్మాదు లదరుదురాయువాఁడు
చలిగట్టుపట్టినిఁ దళుకుమేనఁ గలాఁడు
చిఱునవ్వువెన్నెలల్ జిలుకువాఁడు
వాఁడు వీఁడనక యెవ్వనినైనఁ బ్రోచువాఁ
డఖిలదైవతగురుం డైనవాఁడు
లీలమై శూలంబుఁ గేలఁ బూనినవాఁడు
నలమేనిదొరతూఁపు గలుగువాఁడు

తే. కలితపంపాతటంబున నిలుచువాఁడు
శ్రీవిరూపాక్షశివుఁడు రక్షించు నెపుడు
నఖిలసద్గుణమణిపేటి నారివీటి
చిన్న వేంకటరాయనిఁ జెలువుమీఱ. 2

క. అంబానందనుఁడు మహా
లంబోదరుఁ డఖిలదివిజలక్షితనిజపా
దాంబుజుఁడు విఘ్నహారి ద
యాంబుధి మత్కృతిసహాయుఁడై ననుఁ బ్రోచున్. 3

క. వీణాధర బింబోపమ
శోణాధర మఘపనికరసురుచిరవిలస
ద్వేణీధర పద్మోద్భవు
రాణి లసద్వాణి నన్ను రక్షించు దయన్. 4

క. మద్వంశ్యుల కెల్లప్పుడు
సద్విద్యామహిమ యొసఁగి సత్కృపతోడన్
హృద్వనజములం దగుసం
పద్వైభవుఁ గాళహస్తిపతి నుతియింతున్. 5

తే. అమ్మ జ్ఞానమ్మ శ్రీకాళహస్తివిభుని
కొమ్మ వేలుపురాకాలకులుకుబొమ్మ
సమ్మదమ్మున నిపుడు నానెమ్మనమున
నెలకొని సితాంతసాహిత్యనియతి యొసఁగు. 6

సీ. ఏస్వామి కారుణ్య మెనసినంతనె పటా
పంచలై మాయాప్రపంచ మణఁగు
నేస్వామి యుపదేశమిచ్చినంతనె జీవ
పరమాత్మలకు నైక్యభావ మందు
నేస్వామి శ్రుతివాక్య మెదిరినంతనె భేద
వాదిమతంబులు వట్టి వౌను
ఏస్వామిసామ్రాజ్య మిచ్చినంతనె పున
ర్జన్మంబు లేక మోక్షంబుగల్గు

తే. మోదవిస్ఫూర్తి దక్షిణామూర్తి శివుఁడు
తానె యై యవతరించి నన్ ధన్యుఁ జేసె
నట్టివేదాంతమహితవిద్యాధురంధ
రుండు కాశీపతిస్వామి బ్రోచు నన్ను. 7

తే. మూఁడుమాటల ధర్మంబు మొదలఁ దెలిపి
వెలుఁగునవ్వల వెలిఁగెడువెలుగుఁ జేర్చి

యద్భుతానంద మొనరించునట్టిబ్రహ్మ
కాచి మన్నన నను( బ్రోచు( గరుణతోడ. 8

తే. పుట్టఁ బుట్టినవాఁ డొటఁ బుట్టితేనె
లుట్టిపడునట్టి జిగిమాట లొఱపుమీఱ
రామచరితంబు వర్ణించి రహిఁ దెలుంగు
మొదటికవిరాజు నెంతు సమ్మోద మలర. 9

ఆ ధరణి వ్యాసుఁ గాళిదాసు మయూరుని
మాఘు బిల్హణుని సమంచితగతి
నుతులు సేతు నెపుడు నతులితసంస్కృత
పటుకవిత్వగరిమ పట్టువడఁగ. 10

సీ. వాక్యాసనుం డనువాని నిక్కంబుగా
నలబ్రహ్మదేవుఁడే యని నుతింతుఁ
గుండలీంద్ర సమాఖ్యఁ గొమరొందుకవిచంద్రు
ననువొంద శేషాహి యని తలంతు
శ్రీనాథవిఖ్యాతిఁ జెన్నొందుబుధవర్యుఁ
బురుషోత్తముఁ డటంచు బుజ్జగింతు
ధూర్జటిప్రౌఢిచే నూర్జితుం డగువాని
సాక్షాచ్ఛివుం డని సంస్మరింతు

తే. నవని మఱియును వెలసినయాంధ్రకవుల
నాధునికకావ్యకర్తల యశోధనికుల
సారసాహిత్య సౌహిత్యసరణి వెలయ
వర్ణన లొనర్తు రమణీయ వాక్యములను 11

చ. అపరిమితప్రభావుఁ డగునట్టిమహాకవిరాజు నెంచకే
నృపసభ యన్సరోపరము నెంచి యొకానొకచో వసింపుచుం
గృపణతతో బకాధముఁ డొగిన్ ద్విజరాజు హసించురీతి నే
రిపువగఁబల్కుదుష్కవులఁ బ్రస్తుతి జేతురె సత్కవీశ్వరుల్.

క. అని గురుదేవస్తోత్రం
బును కవినుతి కుకవినింద పొలు పమరంగా
నొనరిచి ప్రబంధ మొక్కటి
యనువందఁగ రచనఁ జేతు నని తలఁచునెడన్. 13

సీ. నీలంపునికరంపునెఱినింపు గలవాఁడు
డంబైనమణికిరీటంబువాఁడు
తోర మౌకస్తూరిగీఱునామమువాఁడు
మకరకుండలకాంతి మలయువాఁడు
కఱిమబ్బుజిగి నొప్పు మెఱుఁగు మేన్జిగివాఁడు
మొలకనవ్వులఁ గుల్కు మోమువాఁడు
జంటైదుతలలరాక్షసునిఁ గూల్చినవాఁడు
వానితమ్మునిఁ బ్రోచువలను వాఁడు

తే. తళుకుబంగారుసరిగంచువలువవాఁడు
తరళపంకేజరుచిరనేత్రములవాఁడు
రామచంద్రుండు కారుణ్యరసము వెలయ
నపుడు నాకలలోనఁ బ్రత్యక్ష మగుచు. 14

క. వత్సా! నిను రక్షింపఁగ
వాత్సల్యం బొదవె నౌ భవన్మధురిమరం
గత్సారవచనకృతినం
దత్సరణిన్ మాకు నంకితము సేయఁదగున్. 15

తే. నేను శ్రీరామచంద్రుండ నిఖిలలోక
కర్తనగువాఁడ నీదుభాగ్యంబుకతన
నిపుడు ప్రత్యక్ష మైతి సందియముపలదు
వేగఁ గృతిసేయు మొకకథ వింత దనర. 16

తే. అనుచు నంతర్హితుం డయ్యె నమ్మహాత్ముఁ
డపుడు నే మేలుకొని మది హర్ష మలర

నెంత ధన్యుండ నని యెంచి యెద్దియేని
తగుప్రబంధము సేయంగఁ దలఁచి యుంటి. 17

తే. అంత నొకనాఁడు పొడగంటి నలరువిలుతు
వంటిచక్కఁదనంబున వలను మీఱి
సకలకవిరాజరక్షణోత్సుకత వెలయు
నట్టియార్వీటిచినవేంకటావనీంద్రు. 18

తే. అమ్మహారాజుదర్శనం బైనయంత
భోజుసముఖంబు గలిగినతేజ మలర
మఱియు మఱియును సుప్రౌఢమధురరచన
బొడమి సంస్తుతిఁ జేసితి భూరిమహిమ. 19

వ ఎండియు నఖండ ఖండపరశు కుండలిపరిబృఢాఖండల మహోద్దండ వేదండ డిండీరపుండరీకపటీర హీర హారతార తారకాచల నారదాపార పారద శారదా శారదశరదశర రాజహంస విరాజమానకీర్తి చంద్రికా ధవళిత బ్రహ్మాండభాండుండును, భాండాగార భరిత నిబిడ ద్రవిణ మణిగణ గణనీయ వైభ వాధరీకృత వైశ్రవణుండును, శ్రవణభూషాయ మాణ సుధా ముధాకరణ నిపుణ నిఖిల పురాణేతిహాస కథా ప్రసంగుండును, సంగరాంగణజయరమాంగనాసమాలింగిత నిజభుజాగ్ర జాగ్రత్ఖడ్గధారా విఖండిత విమతమండలీ గళగళద్రక్త ధారాప్రవాహాభినవ శోణభద్రా ప్రహర్షిత రత్నాకరుండును, కరారవింద బంధురాంబురుహరేఖాద్యనేకశుభలక్షణ భ్రాజమానుండును, మానవతీమనోహరాకార రేఖాకార రేఖావధీరితనవనలకూబర జయంత వసంత యామినీకాంతుండును, కాంతస్వకీయ బాహాప్రతాప ప్రభా విఫాలిత రసాలసాల కిసలయ కింశుక ప్రసవ కాంచన కల్హార కురువింద కందళ దళత్కనకకేతకీ ప్రసూనుండును, సూనృత వచోవినిర్జితహరిశ్చంద్రుండును, చంద్రనగధీరుండును, ధీరజనహృదయరం

జక విహారుండును, హారకేయూరమకుటహస్త కటక ప్రముఖ నిఖిల భూషణాలంకారుండును, కారుణ్యరస పూరితాంతరంగుండును, తరంగవత్యధికగంభీరుండును, భీరుజన సంరక్షణాంచత్కటాక్ష వీక్షణుండును, క్షణక్షణ విచక్షణ క్షణతాభిరక్షితక్షితిసురవారాశీర్వాద వర్ధిత సప్తార్ణవమధ్య సామ్రాజ్యసంపన్నుండును, పన్నగాధీశ మేథాధురంధరుండును, ధరాధినాథ సభాంతర నిరంతరస్తవనీయ సరస సంగీత సాహితీభోజుండును, భోజోద్భవారమణ సన్నిభధరాపాలన ప్రవీణుండును, వీణాధరార్హ మాధుర్య ధుర్యవాగ్ధోరణీ సమన్విత కవితాలతా పునస్సముత్పాదనా మోదవన్మహాకవీంద్రజాలాలవాల సంపూరితకనకవర్షుండును,వర్షాశనప్రభృతి వివిధజీవనోపాయ ప్రదాన సమాహూయమాన శ్రీరంగ కాంచికా శేషాచలాదిపుణ్యస్థలస్థితాశేష విప్ర జనకృతస్తోత్రుండును, సదాత్రేయగోత్ర పవిత్రుండును, విచిత్ర శుభచరిత్రుండును, విరోధివరూధినీ హృదయపుటభేదనకర పరమశివకరసరసిరుహ ముహుర్ముహుస్తాడిత ఢమరుఢమఢ మారవ చమత్కారధిక్కారి భేరీవిరావ నిర్దళిత దశదిశాంతరుండును, శాంత రంజిత గుణగణోత్తరుండును, కర్ణాట కాశ్మీర కాంభోజ గాంధార సింధు సౌవీర మగధ ద్రవిడ కేరళ కళింగ వంగాంగ బంగాళ పాంచాలాది దేశాధినాథవత్తబహువిధోపదాసమారబ్ధగంధసింధురసైంధవబంధురతదీయసౌవర్ణమణిమయకోటీరకోటీరమాసాతత్యసమలంకృత నిజగృహాంగణాభిరాముండును, సోమార్ణవశచీంద్రబలిదధీచిమచున్నెచికీవిరోచన కుమార సంహార తిరస్కరణ నిపుణవితరణ గుణాభరణుండును, షడ్రసోపేతనిరతాన్నదాన ధురీణుండును, వివిధ కళారసాభిజ్ఞుండును, మూరురాయర గండప్రచండబిరుదాంకుండును, ధరణీ వరాహాంకుండును, చాళుక్యనారాయణుండును, ఖడ్గనారాయణుండును, లోభి వేశ్యాభుజంగుండును, చంద్రవంశ పయః పారావార

సంపూర్ణ చంద్రుండును, రామపృథ్వీరమణ సాధ్వీమణి నాంచారమాంబా గర్భ శుక్తిముక్తాఫలంబును, నగు చిన్న వేంకటరాయ రాజదేవేంద్రుండు నిండువేడుకలు మెండుకొనఁ బండువెన్నెలలవన్నెల చిన్నెలఁజెన్ను లరు క్రొన్నెల రాలతిన్నెల నిగనిగల వగలుమీఱు మగరాలగోడల నీడలం దురంగలించు క్రీడాపులినంపుఁగొణింగెల జెలంగురంగుల మెలంగువెలుంగులు గలపట్టంపుచుట్టుబవంతి వింతజిగిదంతపు రేకు సంతనలచే నలరు వంతుమీఱు గుజరాతి కెంపుసొంపు రాణించుబారి దూలంపుకంబంపుగుంపుల నింపలరుతళుకుటద్దంపుచెక్కడపు మిక్కుటపు దారబందపు చందపు కుందనపుతలుపుమెలపులం బొలుపు లగు వాకిళులఁ గట్టిన కట్టాణిమెట్టికలతొట్టికట్టుల ముంగిళ్ల నెసంగు మెచ్చు గలబంగాళి నిచ్చలపు హెచ్చువిలువ పచ్చలపసడాలుసొగసుల నెసంగు కపురంపు టనంటికంబములడంబములవెలయుతోరణంబుల నలరుఘుమ ఘుమలం జెందు చందుర కావిజిలుఁగు చందువాలపొందు వాటిల్లు సాంబ్రాణి ధూపవాసనలు గుబురుకొను ఓత్తర్వుహర్వుపదాఱ్వెన్నె జాళువామిన్నుల నన్నుకొను నును కప్పురాలయొప్పున నొప్పుగొప్పు యుప్పరిగలోన నిందిరారమణచరణారవిందధ్యాన నిష్ఠాగరిష్ఠ శుభచర్యా ధుర్యు లగునాచార్యవర్యులును, నవార్యధైర్యవాదాను మోద కర్కశ తర్కవ్యాకరణవేదాంతాది శాస్త్రార్థపరిజ్ఞానఘనులగు విద్వజ్జనులను, కావ్యనాట కాలంకార సారజ్ఞ రచనాగరిష్ఠులగు సత్కవి శ్రేష్ఠులును, సరసమృదుల సంగీత విశారదపరాజిత నారదముని నాయకులగుగాయకులును, సర్వసర్వంసహాధీశ్వర ప్రధానవర్గభృత్య ప్రముఖులును, సుముఖులై పరమానందకందళిత హృదయారవిందులై కొలువఁ జెలువలరుచలువ పైఠాణిపావడలు వడఁక నొక పడతుక వింజామర వీవ, వేఱొక్కబోఁటి కాళాంజికా ఘనసారవీటికా కరండ ముకురాది రాజ ముద్రాజలాంఛనంబులు కరంబుల వహింప, మఱొక్కకల

కంఠీరత్నంబురత్నకంకణ ఝణఝణత్కారంబు తోరంబుగాఁగపురం
పుఖాగా లొసంగ, శృంగారవైభవంబు లెసంగ బంగారుహారంగు
సింగంపు రతనంపుగద్దియపైఁ బేరోలగంబుండియొక్కనాఁడు. 20

తే. వితతకవితాప్రసంగసంగతుల నతుల
మతులఁ గృతు లయి కృతులు సంస్కృతపదాను
బంధబంధురరుచిరాంధ్రపదము లెసఁగ
రచనఘటియించుసత్కవుల్ ప్రణుతిసేయ 21

క. కరుణాకటాక్షవీక్షణ
తరుణాంబుజముఖవిలాసదరహాసరుచుల్
మెఱయం గురువిద్వజ్జన
సరసానుమతి న్నితాంత చతురత వెలయన్. 22

సీ. నను భరద్వాజగోత్రుని సదాపస్తంబ
సూత్రుని బాంధవస్తోత్రపాత్రు
పాకనాటార్వేలవంశ ప్రసిద్ధుని
ధూర్జటిపౌత్రు బంధురచరిత్రు
సద్గురుకారుణ్య సంప్రాప్తవిద్యావి
హారుని శ్రీకాళహస్తినిలయ
చిత్ప్రిసూనాంబికాశ్రీకరానుగ్రహో
పాదితకవితారసజ్ఞహృదయు

తే. సారరచనాధురీణుఁ గుమారధూర్జ
టిప్రధానాగ్రగణ్యుఁ బటీరహీర
మహితసత్కీర్తి కాళియామాత్యపుత్త్రు
వేంకటార్యునిఁ బిలిపించి వేడ్క ననియె. 23

క. బాలుఁడ వయ్యును విద్యా
శీలుఁడవు గభీరమధురశృంగారకళా

లాలితచాతుర్యకవి
త్వాలోచననిపుణ వేంకటామాత్యమణీ. 24

ఉ. చిత్రము గాఁగఁ, జిన్నపుడె చేసితి వౌ రసముల్ చెలంగి సా
వి్త్రిచరిత్రముౘ మిగుల వేడుక నిందుమతీవివాహముౘ
స్తోత్ర మొనర్ప నర్హమగు సూక్తిగతిన్ రచియించి తొఁగదా
ధాత్రిఁ బ్రసిద్ధిఁగాంచితివి ధన్యుఁడ వౌర కుమారధూర్జటీ. 25

పంచచామరము.

కుమారుఁ గన్నతండ్రిభక్తికూర్మిఁ గన్ననీ కహో
కుమారమణ్యధీశశంఖుఘుంఘుమారవత్సన
త్కుమారతుల్యచిత్కళాభిగుప్తసూక్తి వింతయే
కుమారధూర్జటీ రసార్థగూఢరూఢవాగ్ఝటీ. 26

చ. తెలుఁగునఁ జెప్ప నేర్చితి సుధీజను లెల్ల సెబాసు ధూర్జటీ
భళియనఁదళుక్కుగుల్కువగబాటిలుతేటతెనుంగుమాటలన్
మెలకువఁగాంచుబెళుక్కుజిగిమించఁ బ్రబంధములన్ఘనంబుగా
బలుకులముద్దరాలిజిగిబంగరుటందెరవల్ చెలంగఁగన్. 27

ఉ. ఒక్కొకవింతహోర నిజయుక్తుల సూరిజనుల్ నుతించఁగాఁ
జక్కనిమాట లెంతయు రసస్థితి ముందర బాఱుదీఱఁగాఁ
జక్కెరలొల్కుఁదేనియలు సారెకుఁజిల్కగభవ్యకావ్యముల్
గ్రక్కునఁ జెప్ప నేర్తువనఁగా వినఁగా గడు వేడుకయ్యెడిన్.

చ. స్తుతమతి యైనయాంధ్రకవిధూర్జటిపల్కుల కెట్లు గల్గెనో
యతులితమాధురీమహిమ నాముసు మీపెదతాత చాలస
న్నుతిఁ గనెఁ గృష్ణరాయలమనోజ్ఞసభన్వినుమీవునట్లుమ
త్కృతబహుమానవై ఖరులఁగీర్తివహింపుముధాత్రిలోపలన్

క. మాకరుణకుఁ బాత్రుండవు
ప్రాకటగతిఁ బద్యకావ్యఫణితిం జెపుమా

శ్రీకృష్ణరాయచరితము
నీకవితాప్రౌఢి సుకవినికరము మెచ్చన్. 30

తే. అనుచు బంగారుకడియముల్ హారములును
తాళి చౌకట్లు జాళువాతగటిపాగ
రంగలరుపట్టుపచ్చడా లుంగరములు
తళుకుజిగిమేల్మిసరిపెణుల్ దయ నొసంగి 31

క. ఉరుధాటీఘనఘోటీ
వరశాటీస్వర్గ్రహారవాటీచిత్ర
స్ఫురితమణిపేటు లాదిగ
స్మరకోటిసమానుఁ డతఁడు సమకొల్పి కృపన్. 32

తే. సారఖర్జూర కదళికా నారికేళ
ఫలసముత్కర చందనకలిత కుంకు
మములు గస్తూరియును సంకుమదము మొదలు
గాఁగఁ గర్పూరవీటికఁ గరుణ నొసఁగె. 33

ఉ. అందుల కెంతయుం బ్రమదమందుచు రాయలవారలౌరనా
డెందమునందుఁ గల్గినటు లీవి నొసంగె ధరిత్రిలోన నీ
యందమునన్ రసజ్ఞు లయినట్టిదొరల్ గలరే యటంచు నే
బొందుగఁగృష్ణరాయకథఁబొల్పగుకావ్యముఁజేయఁబూనుచున్. 34

తే. అమ్మహారాజుతోడ నిట్లంటి మఱియు
జనవరేణ్య భవద్వాక్యసరణి నిపుడె
కృతి యొనర్చెద నదియు నంకితము జేయు
టెవ్వరి కటన్న నవ్విభుఁ డిట్టు లనియె. 35

క. శ్రీరాముని కంకితముగ
గారవమునఁ జేయు మనఘ కడు శీఘ్రముగా

శ్రీకంఠిలు నీ కనవుడు
నౌర మహీజా భాగ్య మబ్బె నని కడువేడ్కన్. 36

-షష్ఠ్యంతములు-

క. శ్రీజనకనందనా స్తన
రాజత్కుంకుమకళాభిరాజితవక్షో
భ్రాజితభూషణఘృణికి మ
హాజినటద్దితిజసామజావళిసృణికిన్. 37

క. చండతరదివ్యసునిశిత
కాండునకు నజాండభాండఘటనాఘటనో
ద్దండునకు నండజాధిప
కాండునకున్ సుగుణరత్నఘనకాండునకున్. 38

క. శారదనీరదనారద
పారదహిమతారహీరబంధురకీర్తి
శ్రీరమ్యునకున్ సద్వి
ద్యారహితజనాళిమానసాగమ్యునకున్. 39

క. రామునకు సర్వజగదభి
రామునకున్ విజితపరశురామునకు ముని
స్తోమస్తుతబహువైభవ
ధామునకు సురారివరసుధాధామునకున్. 40

క. ఆర్వీటివంశ చినరా
జోర్వీరమణాభిరక్షణోత్సుకునకు గం
ధర్వాదిదివిజనుతునకు
సర్వజ్ఞునకున్ సమస్తజగదీశునకున్. 41

వ. నా విన్నవింపం బూనిన కృష్ణరాయవిజయం బనుమహాప్రబంధం
బునకుం గథాప్రారంభం బెట్టి దనిన. 42

# ప్ర థ మా శ్వా స ము

-కథాప్రారంభము-

సీ. శ్రీరమారమణవిహారహారిగృహంబు
బహుశోభనాన్వితప్రత్యహంబు
సతతపౌరజనాచరితవిస్తృతమహంబు
దుర్వారచతురంగధూర్వహంబు
శ్రమహరత్సుమగంధసహితగంధవహంబు
దీపితారాతిగర్వాపహంబు
నాయికానాయకోన్నతరహఃకలహంబు
సర్వవస్తువ్రాతసంగ్రహంబు
తే. మహిని రహి మీఱునౌర పంపానదీత
రంగసంఘుమంఘుమారవవిధూత
జాహ్నవీనిమ్నగాసుధాసాగరంబు
విజయనగరంబు సుజనసంవిత్కరంబు. 43

ఉ శ్రీ దళుకొత్తుఁ దత్పురినిఁ జెన్నగుమేడ లనంతరత్న సం
ఛాదనలీలఁ జెంది వరుసన్ బహు రాజమరాళసంతతా
హ్లాద మొనర్చుచున్ ఘనసుధాంశుపరిస్ఫురణావృతిస్థితిన్
మేదినిఁ జూడఁ జూడ సెలమి స్మరదంబుదరేఖలో యనన్ 44
మ. తనసాలస్థితిఁ జూచువారికి యథార్థంబై తగం గోట యొ
ప్పు నవీనద్యుతిఁ గొమ్మ లంబరమునన్ బొల్పార సంబద్ధర
త్ననికాయంబులుకాయలున్ ఫలములాదారింబ్రకాశింపఁగా.
ఘనతన్ జాలకజాలముల్ దళములుంగన్పింప నాప్రోలునన్. 45

సీ. పార్శ్వస్థగిరిదరీపద్మ రాగప్రభల్
పొలు పైనకుంకుమపూఁత లనఁగఁ
దుంగభద్రానదీ తోయబిందువ్రాత
ములు సుపాణిమెఱుంగుముగ్గు లనఁగ
నికటాద్రి జపటీరనికషణజ్వలనధూ
మములు సాంబ్రాణిధూమము లనంగ
మందానిలోద్ధూతమాకందఫలపరం
పరలు నైవేద్యసంపద లనంగ
తే. నౌర యకృతప్రయత్నోపచారగరిమ
లమరె నని దివ్యమునులెల్ల నభినుతింప
సకలనిత్యోత్సవంబున సంతతమును
హరిహరగృహంబు లలరుఁ దత్పురమునందు 46

సీ. తతరజోగుణవృద్ధిఁ దాల్చుచు సతతంబు
రాజహంసాధఃకరణ మొనర్చె
దానభోగాసక్తిఁ దప్పక నిరతంబు
సురపానహితయుక్తిఁ జూడనేర్చె
భూకాంతహితసూక్తిఁ బొరయనియొకపద్య
ఫణితిని దుర్దైత్యగణము నెంచెఁ
దనశక్తిఁ దలఁచి యుండకయె మున్ బోరి వి
శ్వామిత్రు మంచివాఁ డనుచుఁ బల్కె
తే. నరయఁ జదు వెంత యాచారపరత యెంత
కవి యనుట యెంత సామర్థ్యగరిమ యెంత
యనుచు నవ్వుదు రచటిధరామరోత్త
ములు విధి గురు భృగుజ వసిష్ఠుల నయారె. 47

సీ. గుపుకర్ణహరణదుష్కరమహాధర్మ్యఁడై
మును పేడి యనిపించుకొనక యున్న
నొకశిఖండికి చాల నొద్దిక యై బ్రహ్మ
చర్యవ్రతునిఁ జంపఁ జనక యున్న
నాయుధంబులు మాని ప్రాయోపవిష్టుఁడౌ
పుణ్యాత్మ్మకర మేయఁ బూన కున్న
దురములో నొకగొల్లదొర సహాయుఁడు గాక
కలకాలము స్వశక్తి గలిగి యున్న

తే. మెచ్చవచ్చును విప్వచ్చ హెచ్చు గాఁగ
ననుచు బ్రహసింతు రధికబలై కరణజి
తారివీరులు నసహాయశూరు లైన
రాట్కుమారులు తత్పురీరత్నముననను. 48

ఉ. ఎప్పుడుఁ గోటికిం బడగ లెత్తినవారు మనీష శేషునిం
దప్పులువట్టువారు వరదానవిభూతినిఁ గర్ణముఖ్యులం
దెప్పెడివారు ధర్మములు దిక్తటులన్ వెలయించువారునై
యప్పురిలోనివైశ్యులుసుఖాన్వితులైవసియింతు రెంతయున్. 49

ఉ. హృద్రమణీయవారిజదర్శిభ్రమరీభవధీశు లప్పురీ
శూద్రులు విప్రభక్తిజయశోభలభద్రులు జన్యరంగసౌ
భద్రులు ధైర్యనిర్జితసుపర్వమహీధ్రులు దాతృతానిలిం
పద్రులు సర్వసస్యబలభద్రులు బొల్తురు సద్గుణోన్నతిన్. 50

చ. రతిపతిమోహనాస్త్రములు రత్నశలాకలు కాంచనోజ్జ్వల
ప్రతిమలు మల్లికాలతలు పద్మజునంచలు నాట్యశాస్త్రదే
వతలు సుధాంశురేఖలు ప్రవాళపురెమ్మలు ముద్దుగుమ్మల
ద్భుతనవయౌవనాకృతులఁ బొల్చినతత్పురివారకామినుల్

మ. వెరుసన్ బృంహిత హేషగర్జలెసగన్ వర్షాంబుధారాగతిన్
వరగండద్వితయీగళత్పృథుఝరీవారంబు లుప్పొంగ న
ప్పురసుందర్ గజబృందముల్ దనరునంభోధిస్థలోత్క్రాంతసం
చరదద్రీంద్రములో యనంగ నవరాజన్నీలమేఘోన్నతిన్. 51

సీ. ఒక్కనిబ్బరముగా హురుమత్తుపరువెత్తు
సళ్ళించుకళెముల్ ఘల్లనంగ
మళ్ళించుచీరైనమలచినవలయాద్రి
దాటి క్రమ్మఱ వచ్చుదాటు వెలయ
గడువడిఁ జేసన్న కంత మాస్ఫాలింప
చౌకముల్ రవ లెచ్చ సంచరించు
చండవేగంబు లై రెండువీథుల జుట్టు
వేడెముల్ వచ్చు ప్రవీణగతుల 52

తే. నౌర సాదుల నెమ్మేను లలయ నీక
వన్నియకడాని రెండంకె వన్నె లలరఁ
దత్పురీరత్నమూత్న గాంధారసింధు
బాహ్లికారట్టకాంభోజపటుహయములు. 53

సీ. మధురసాధికసుధామధురసారోల్లస
న్మధురసావల్లరీమహిమతోడ
సురసాలతుల్యభాసురసాలవనమధ్య
సురసాలజంబీరతరులతోడఁ
బున్నాగహితసూనపున్నాగసంచర
త్పున్నాగకైతకస్ఫురణతోడ
బాలికారమణీయ పాళికాసవమధు
పాళికాసారసంపదలతోడ

తే. మల్లికావల్లికాగిరిమల్లికామ
తల్లికలతోడఁ దాళహింతాళకదళి
కావకుళసంఘములతోడ ఘనత మీఱు
నౌర విద్యానగరమహోద్యానతతులు. 54

సీ. చిగురాకుపైఁ గెంపుసొగసయ్యె బింబోష్ఠ
యది ప్రవాళప్రౌఢి నలరుఁ గాదె
అలులు నీచూపుల కలరునే చపలాక్షి
పైఁడి నల్గినవానిపస య దెంత
గోరంటవిరిగుత్తిసౌ రంటునె లతాంగి
చెల్లఁబో నీ కేల గిల్ల నగునె
ఆననపరిమళం బమరునే చంద్రాస్య
వలచువారికి లేవె వలపువిరు ల

తే. టంచు భావార్థగూఢవాక్యములు మెఱయ
సరససాంబ్రాణిధూపవాసనలవిరులు
విటుల కందిత్తు రప్పురివీథులందుఁ
బూలసరు లమ్ముప్రాయంపుఁబూవుబోండ్లు 55

వ. మఱియు నప్పురవరంబు కరంబు తిరం బైన శృంగారంబు నం దనరుచుఁ దనరుచులం బ్రచురంబు లై యంబరమణీ వితానంబుల నవలఁ ద్రోయం గలమెఱుంగుల రంగలరు బంగరుహొరంగుల నెసంగి చెంగలువరారాలడాలు గీఱుకొను ప్రరులహరువులమురువుల మురువు మీఱిధరాపురంధ్రీ చరణనూపురం బనందగి ధర్మపుంగవమహోన్నతం బగు మూఁపురం బనం గల పురద్వార పృథుగోపురంబు సవిధ వివిధ హేమకూటమతంగప్రముఖనిఖిలధరాధరంబులమించి గోపురోపరిలో కంబులఁ గ్రమక్రమంబుల నధిగమించిన యౌన్నత్యంబున సత్యలోక

పర్యంతంబు సొంతత్యంబు గనుటఁ దదీయవైచిత్ర్యంబుం గనుంగొని తనకన్న మిన్న యగు సృష్టిచాతుర్యంబు గన్న పురుషవర్యుం డెవఁడిది నిర్మించెనో యని యద్భుతంబున దద్వైదగ్ధ్యసాకల్యసమ్యగ్వీక్షామతిం జనుదెంచి యంతరిక్షంబున నిల్చినవిరించి వెంట నంటివచ్చిన నిలింపశంపాలతాంగు లని యప్రతిమానఖచిత ప్రతిమానికరంబుల నంతఃపురసౌధవీధికాజాలమార్గంబుల నిరీక్షించుఁ జంచలాక్షులనిద్దంపుముద్దుమోములఁ దద్దయుం బ్రొద్దు సుద్దదిద్దడపు పచ్చరాగచ్చుమేల్మచ్చుల నిచ్చలపు సోరణగండ్లదారిం గనుంగొను పురాంగనల ముచ్చటలెచ్చు జిలిబిలిపలుకులకులుకులకు మెలఁకువ లెసంగ ననంగ సంగరసమయ గళగవంబులం దలంపించు కిలకించితంబుల కలరవంబు విని ముఖారవిందంబుల నెలనవ్వు లొలయ సొలయునిజాననంబులం దప్పక చూచు ప్రియునిచెయువులకుఁ గలకల నగుచు సరసంబులు మెఱయ వినయంబులు నెఱయు వారలతోడ మందిరాళిందబహిర్ద్వారవజ్రనిర్మిత వితర్దికలం గూర్చుండి చతురలై చతురంగద్యూతలీలాలాలసలగువారబాలామణుల కటాక్ష వీక్షణంబులను క్రొవ్వాడితూఁపులు గాడిన డింది వలరేనివేఁడిమింబొంది పోఁడిమి దక్కిచిక్కుఁబడి యొక్కొక్క నెపమ్మున నవలఁజను విటులచటులవాక్పటిమలం బిలుచుపడుచువగపూవిలువచెలువల చెలువలరు పలుకుజలువల కలకల నలరులు గొనం దొరసి బోటుల యటమట లాకర్ణింప నింపొనరు సొంపుపెంపులం జాణతనంబున నుత్తరంబు లొసంగుచమత్కారంబులు విను పరాకున బేరంబు లాడందడబడు వైశ్యకుమారుల యంగళ్ళ చెంగటిముంగిళ్ల నిండియుండు కుంకుమసంకుమదకర్పూరచందనాగరు కస్తూరికాది పరిమళవిచిత్రవర్ణి కావివిధపట్టాంబరంబుల నలంకృతంబు లగువిపణి కలతోరంబు లగు పచ్చతోరణంబుల తోరణంబు లొసఁగు ప్రతిభవనాంగణప్రవర్ధితంబు లగుపాళికా నారికేళ పాళికలనీడల జాడల నాడా

డాదం జూడజూడ వేడుక నాడుచుండు బాలురయాటపాటలకు మోదంబు గదుర గ్రక్కున నక్కునం జేర్చుకొనుతల్లు లగువనితా మతల్లులతనూవల్లుల నల్లువితంబు లగుభూషణద్యుతుల హల్లీసకంబుల గుసువర్ణాంశుకంబులం గదలించుకమ్మదెమ్మెరల చలాచలంబులగు గగనభాగధగద్ధగాయమాన సౌధయూథ నవీనకేతనప్రభావిభాసితంబులగు రాజమార్గంబులం గట్టిన నవరత్ననూతనకిరణంబులు ధరారమణీఘనాభరణంబుల రత్నంబులనంగనుపట్ట నమరావతిరీతి సుధర్మాభిరామ విబుధ నికరరంభాచిత్ర రేఖావిచిత్రంబై హస్తిపురంబుభాతి శాంత నవరాజరాజగురుకృపాలంకృతంబై యింద్రప్రస్థంబుచందంబున యుధిష్ఠిర భీమార్జునకీర్తిధుర్యంబై ద్వారకానగర ప్రకారంబున నచ్యుత ప్రద్యుమ్న బలభద్రభాసితంబై భోగవతియందంబున ననంత కుండలీంద్ర ప్రముఖ పున్నాగవిరాజితంబై సరోవరంబువిధంబునం గువలయద్విజాశ్రయంబునుం గమలాభిరామంబు నగుచు నాలస్యంబు నితంబినీగమనంబులయంద, చాంచల్యంబు చంద్రాననాలోచనంబుల యంద, వక్రత్వంబు చక్రస్తనీనీలాలకంబులయంద, కాఠిన్యంబు బాలామణీకుచద్వయంబులయంద, చోరత్వంబు మానినీమాన ధనంబులయందునుం గాని మఱెందును లేక సర్వశుభలక్షణంబులఁ జెన్నొందు నప్పురంబున కధీశ్వరుండు.

ఉ. శ్రీరమణీమనోరమణసేవనతత్పరుఁ డబ్జసంభవ
శ్రీరమణీయకీర్తినిధి చిత్తజసన్నిభమూర్తి విద్విష
ద్వీరభయంకరప్రకటవిశ్రుతశౌర్యధురంధరుండు నౌ
వీరనృసింహరాయపృథివీపతి పొల్చు నఖండసంపదన్. 57

సీ. తనకీర్తిచంద్రికల్ దశదిశాభామినీ
కమనీయకౌశేయకములు గాఁగ

దనప్రతాపద్యుతుల్ ఘనవైరిరాడ్గర్వ
తిమిరౌఘబాలాతపములు గాఁగఁ
దనసద్గుణావళుల్ వనధివేష్టితధరా
వితతార్థికల్పకలతలు గాఁగ
దనవచోనిచయముల్ వినుతవిద్వత్కవీం
ద్రమణికర్ణావతంసములు గాఁగఁ

తే. ధరణిఁ జెలువొందు నిజఖడ్గదళితవిమత
మండలోద్దండవేదండమండలుండు
మండలీకృతచండకోదండగళిత
కాండదుస్సహుఁ డాధరాఖండలుండు 58

ఉ. అంచితకీర్తి యన్నరవరాగ్రణి ప్రొద్దున నొక్కనాఁడు మే
ల్కాంచి ధరామరద్వయినిఁ గన్గొని శ్రీహరినామకీర్తనల్
మంచిపురాణముల్ బుధసమాజము దెల్పఁగ నాలకించి మో
దించి ప్రభాతకృత్యములు దీర్చి సత్కృతిఁబంచివారలన్. 59

తే. కళుకుబంగరువన్నె బంగరుమెఱుంగు
రహి జెలంగుజగాహజారంబులోని
చికిలితుమ్మెదవగ లానుచిత్రమణుల
దంబు మీఱిన సింహాసనంబుమీఁద. 60

సీ. మొగి సలాము లొనర్చి ముదముతో దవ్వుగ
భయముతోడ వజీర్లు బారు దీఱ
సాష్టాంగముగ మ్రొక్కి సామంతనృపకోటి
కోటీరమణిఘృణి గ్రుమ్మరింప
మన్నీలు బాంధవుల్ మన్నన గ్గలవార
లొకదండ సంతోషయుక్తి నుండఁ
గానుక ల్గొని వచ్చి గౌరవం బలరంగ
బాశెంపుదొరగుంపు ప్రస్తుతింప

తే. దండిభవభూతినిభు లైన దండికవులు
సరసవిద్వత్కవుల్ దనసరసఁ వెలయ
వనిత లిరుగడఁ బైఁడిపావడలు వీవఁ
బ్రమద మలరంగఁ బేరోలగమున నుండె. 61

వ. తదనంతరకథావృత్తాంతం బెట్టిదనిన. 62

చ. అనుపమితప్రభావయుతహారిచరిత్రధరాసుతామనో
వనరుహమిత్ర మిత్రకులవారిధినాథనిశాకళత్ర స
జ్జనవనచైత్ర వైద్యుతనిజద్యుతిమద్ఘనసేత్ర లోకపా
వననిజనామకీర్తననివారితభక్తవరాఘ రాఘవా. 63

క. శరదిందువదనకుంద
స్ఫురదంచితరదన దివిజమునిహృత్సదనా
యరవిందదృశాళిమనో
హరనిజకేలనజితాఖిలాసురకదనా. 64

మాలిని. హారిదృగ్బంధురా హారయుక్కంధరా
నీరజాతేక్షణా నిత్యసత్యక్షణా
ధీరసన్నాధితా దివ్యరాడ్వందితా
భూరివిద్యానిధీ భూమిజాసేవధీ.

గద్యము. ఇది శ్రీమదోరుగంటి కాశీపతిసద్గురురాజయోగీంద్ర చరణారవింద మనోవిహార నిరంతరానందకర రాజయోగ సామ్రాజ్య లక్ష్మీధురంధర స్వస్వరూపానుభవసంపన్న జ్ఞాన ప్రసూనాంబికా కాళహస్తీశ్వరకరుణా కటాక్షవీక్షణప్రసాదిత కవితాచమత్కార కాళయామాత్య లక్ష్మాంబికా దత్తపోలమంత్రిగురువమాంబికాకుమార ధూర్జటిప్రణీతంబైన శ్రీకృష్ణ రాయవిజయం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీ ర స్తు

# కృ ష్ణ రా య వి జ య ము

## ద్వితీయాశ్వాసము

శ్రీ విలసదారుపీటికు
లావిర్భావచినవేంకటాధిపరక్షా
ప్రావీణ్యభక్తిగణ్యద
యావృత కోదండరామ యతులితధామా. 1

సీ. అందంబుగ నలికమం దొప్పు తిరుమణి
తిరుచూర్ణమును వింతమెఱుఁగు లీన
నిద్దంపుఁజెక్కుల ముద్దుగుల్కఁగడాని
కుండలంబులకాంతి మెండుకొనఁగ
శంఖచక్రాకీర్ణసౌవర్ణమకుటముల్
ధళధళద్యుతులు దిక్తటుల నించఁ
బదియాఱుమూరడంబపుటంచుకమ్మిడాల్
కంబిదోవతిచెల్వు మించు లెసఁగ
తే. కంఠవలమాననవమాలికల్ రహింపఁ
గేలఁ బద్మాక్షమాలికల్ గీలుకొల్పి
వియ్య మందంగ ధారాళశయ్య సత్ప్ర
బంధరావంబు నెఱయంగఁ బ్రౌఢి వెలయ. 2

క. కడువేఱుక నడుగడుగునఁ
బుడమిన్ సాష్టాంగముగను భుజముద్రలతో

నడుగులకు మ్రొక్క జనముల
నడియందాసోహమనెడియార్భటు లెసఁగన్. 3

సీ. ఆచార్యకరుణ చక్రాంకనమ్ములు మీకు
నింతవఱకును లే దేమి రోరి
మీతండ్రి తాత మాచేత శిక్షితు లైరి
మీ రెఱుంగరె చిన్నవారు గాన
తిరుమాళిగెకును రా దీఱదో యిన్నాళ్ళ
వలెఁ గాదు మించె నైశ్వర్య మౌర
మంచిది యైన నే మాయెలే దయచేసి
నారము లేదు లే నేర మిదిగొ

తే. దీర్థమును ప్రసాదము మీకుఁ దెచ్చినార
మనుచుఁగొంద ఱొసంగుచు నద్భుతముగ
వెంట నిజశిష్యగణములు వేలు గొలువ
వైష్ణవులు వచ్చి రపుడు భూవరునిసభకు. 4

ఉ. పొంకపుపట్టెనామములు పొల్పగుమేల్తిరుచూర్ణరేఖలున్
చంకల తాళికాదళవిసారితపేటికలున్ భుజంబులన్
సంకును చక్రము ల్గలుగుసాత్తనివా రరుదెంచి రప్పు డా
పంకజనాభపాదయుగభక్తులవెంబడి సందడించుచున్. 5

సీ. చిత్రవస్త్రములతో సిగలపైఁ గట్టిన
శివలింగము ల్వ్రాలఁ జిందులాడ
కర్ణాంతవిశ్రాంతఘనఫాలభసితత్రి
పుండ్రగంధాక్షతస్ఫూర్తులమర
స్ఫటికప్రవాళ: స్ఫుటభుజాంతరనట
ద్భద్రరుద్రాక్షనైపథ్య మలర

గటినిఁ గట్టిననీరుకావిదోవతిచాయ
లెఱ్ఱగన్నెరుపూల నీసడింప

తే. హర మహాదేవ పార్వతీశ్వర యటంచు
వెంట శైవద్విజుల్ గొంద అంటి రాగ
నధ్యయనధుర్యు లైనయారాధ్యవరులు
సరగ నరుదెంచిరి నృపాలుసముఖమునకు. 6

ఉ. వచ్చినయమ్మహాత్ములకు వందనము ల్ఘటియించుచు న్విభుం
డచ్చెరు వొప్పఁగా మణిమయాంచితకాంచనపీఠసీమలం
దచ్చినభక్తి నుంచి వినయంబు జనింప శుభోక్తిమించ వా
రిచ్చుప్రసాదతీర్థముల నెంతయుఁ గైకొని వేడ్కనిట్లనెన్. 7

శా. శ్రీరంగస్థల శేషశైలముఖ లక్ష్మీనాథదివ్యస్థలిన్
శ్రీ రంజిల్లఁగ వైభవోన్నతులచే జెన్నొప్పునే నావు డా
ధీరశ్రేష్ఠులు తావకాంచితయశస్తేజోవిరాజన్మహా
జ్ఞారూఢిన్సకలోత్సవంబులునుబొల్పొనన్న హృష్టాత్ముఁడై. 8

తే. పాంచభౌతికలింగప్రభావలీల
నలరునేకామ్రజంబుకేశులకు ధారు
ణీశ్వరునకును గాళహస్తీశ్వరునకు
నలచిదంబరునకు వేడ్క లలరు ననుచు. 9

శా. గారా మొప్ప గభీరసూక్తిమయోగక్షేమముల్ప్రౌఢులా
నారాధ్యు ల్దెలుప న్నృపీ యనుచు నత్యంతప్రమోదాప్తినెం
దే రాజన్మణిభూషణాంబరతతుల్ తేజిల్లుగ్రామాళి వే
ర్వేఱన్ వారికినిచ్చిపంపెహృదయావిర్భూతకారుణ్యుఁడై. 10

శా. ఆక్షోణీరమణాగ్రగణ్యుఁడు విరూపాక్షేశ్వరస్వామికిన్
రక్షాశిక్షకుఁ డైనవిట్ఠలునకున్ రంజిల్లునిత్యోత్సవం

బక్షయ్యబుగ మించునంచు నిజభృత్యశ్రేణి దెల్పన్నితాం
తక్షేమంకరుఁ డై పురీజనులు నానందంబునం జెందఁగన్. 11

పంచచామరము.

దణాయలున్ దలారులున్ ముదంబునం గ్రమంబుగా
క్షణక్షణంబునం బరాకు సారెసారె దెల్పఁగా
రణాంగణావధీరితారిరాజరాజి యైశుభే
క్షణక్షణాభివీక్ష్యరక్ష్యసత్కవీంద్రపాళి యై 12

వ. తత్సభాసదులం గనుంగొని. 13

క. వెలయఁగ విద్యారణ్యులు
చెలువల*రం గని పురంబు సేయక మును పే
కొలఁది దనరారు నీస్థల
మిలలో నిచ్చటి మహత్త్వ మెందునుగలదే. 14

శా. విద్యారణ్యు లనంగ నెవ్వరతఁ డేవిద్యం బ్రకాశించె నీ
హృద్యంబైనపురం బొనర్చువిభవం బేలాగునం గాంచెనో
చోద్యంబయ్యెడిమీరు విన్నకథ యిచ్చోటెస్సగాఁదెల్పఁడీ
యాద్యంతంబునటన్నఁదత్సభికులాహ్లాద-బుతోనుండఁగన్. 15

మ. రమణీయాభ్రతరంగిణీఘుమఘుమారావార్థగంభీరవా
క్కృమజంఝూనిలధూతమష్కవిమహాగర్వాభ్రసంఘుఁడు
ది, గ్రమణీమౌక్తికహారబంధురయశో రాజద్గుణాఢ్యుండు డిం
డిమపుంభావసరస్వతీంద్రుఁడనియెన్ దీవింబ్రకాశించుచున్. 16

క. స్వామి విద్యారణ్య
స్వాములచరితంబుఁ దెలుపవలె నంటిర్ గా
యీమానవులకు నమ్మని
సామర్థ్యం బెఱుఁగ వశమె జగతీరమణా. 17

* రఁగ నీపు.

మ. నరు లజ్ఞానవిమోహితాత్ములగుటన్ రక్షింపఁగా నెంచి శం
కరుఁడే శంకరుఁడై విభేదమతముల్ ఖండించి వేదాంతశా
స్త్రరహస్యస్థితిఁ దెల్పఁగా నతడె విద్యారణ్యమూర్తిన్ జగ
ద్గురుఁడై తోఁచేఁ దదీయవైభవము లెందున్మెచ్చఁగా శక్యమే. 18

తే. సకలవిద్యాప్రవీణుఁడై జనవరేణ్య
యమ్మహామౌని శ్రీలక్ష్మి ననుసరించి
మహితచింతామణీమంత్రమర్మ మెఱిఁగి
సాత్త్వికోన్నతిఁ బెక్కేండ్లు జపముఁ జేసె. 19

వ. అమ్మునీంద్రచంద్రుడు వెండియు నఖండవిద్యాసుధాసాగరంబునఁ బొడమిన రత్నంబుకై వడిం దనరుతనకు నమ్మహాదేవితోడుగావలయు ననితదీయసాక్షాత్కారంబపేక్షించు తీవ్రతకుం గరుణించి యొక్క నాఁడు. 20

సీ. కలువలు వెదజల్లుకలికిచూపులతోడ
ముద్దుగుల్కెడుమెఱుంగుమోముతోడఁ
గుందంబు నణఁగించుమందహాసముతోడ
విలసిల్లువాలారువేణితోడ
మించుల నలరించు మేల్మిసొమ్ములతోడఁ
దమ్మిపూ లమరుహస్తములతోడ
శ్రీహరికొనగోటిచెక్కునొక్కులతోడ
దళుకుమించుకడానివలువతోడఁ

తే. గాముఁ గన్నమ్మ నలమేనిసామికొమ్మ
కమ్మపూరెమ్మ యపరంజికళుకుబొమ్మ
కలిమిముద్దులగుమ్మ సత్కరుణ గ్రమ్మ
నమ్మునీంద్రునిమ్రోలఁ బ్రత్యక్ష మగుచు. 21

తే. వరమునీశ్వర వేఁడుము వర మటన్న
కరము మోడ్చుచు సంతోషకరము గాఁగఁ

బరమసద్భక్తి వెలయఁ దత్పరమతీవ్ర
భాసమానస్థితుల్ మించఁ బ్రస్తుతించి. 22

తే. అమ్మహాదేవితోడ నిట్లనియె నతఁడు
వేడ్కఁ మీఱ గ నాపేర వెలయునట్టి
పురము గావింపవలయుఁ దత్పురమునందుఁ
జెలఁగి సంతతమును నీవు నిలువఁదగును. 23

చ. అన విని యిందిరారమణియమ్మునిచంద్రునితోడఁ బల్కెనో
వినుతగుణాఢ్యనీదువెనువెంటనెవచ్చెదఁబొమ్ము ముంగలన్
ఘనతరలీలలం బురముగట్టుటకుం దగుచోటుగాక నన్
గనుఁగొనఁబోకు మియ్యెడనె క్రమ్మఱి సన్మునిరాజశేఖరా. 24

వ. అనిన నమ్మహానుభావుం డట్లనె తనయున్నచక్కటికిం జక్కనిదక్షిణంబుగాఁ గతిపయప్రయాణంబులు చనిచని ముందట. 25

శా. రంగత్తుంగతరంగఘుంఘుమరవద్రాఘిష్ఠశైలాంతరా
భంగగ్రావపరస్పరోత్కషణబిభ్యద్గ్రాహపాఠీనసా
రంగానీకకుళీరహంసబకచక్రక్రౌంచవన్యోత్థమా
తంగధ్వన్యధరీకృతాఖిలసముద్రం దుంగభద్రానదిన్. 26

క. కనుఁగొని యమ్మునిచంద్రుం
డనువొందఁ గృతావగాహుఁడై తత్తటినీ
ఘనతరతటస్థితుం డై
తనరువిరూపాక్షశివుని దర్శించె వెసన్. 27

వ. తదీయస్థలప్రభావంబుఁ దెలియం గోరినం బురాణజ్ఞు లగుపారులిట్లనిరి.

తే. మునుపు సుగ్రీవుఁడును వాలియును గడంగి
భండనముఁ జేసి రిచ్చట ప్రబలుఁడైన
వాలి కలికి మతంగపర్వతము నెక్క
నల్లరవిసూనుఁడట వాలి కరుగ రామి. 28

తే. అమ్మతంగమునీంద్రునియాజ్ఞవలన
శాపయుక్తుండు గాన నాశైలమునకు
జనఁగ భయ మంది సుగ్రీవుఁడాఁడఁబోక
క్రమ్మఱును వాలి యిది పూర్వకథ మహాత్మ. 30

సీ. ఇది నిజోన్నతశృంగహేవాకజితమేరు
కుధర మై తగు హేమకూటశైల
మది పతంగతురంగహరితప్రభాసంగి
మరకతశిఖర మౌ మాల్యవంత
మిది వశ్యమునిదృశ్యహితలతాంచితమహా
భూమీజయుతఋశ్యమూకశిఖరి
యదీ మతంగజబృంహితారవప్రతిరవ
ప్రదకంధరమతంగపర్వతంబు
తే. మునిజనోత్తమ కిష్కింధ యనఁగఁ దనరు
నమ్మహాపుణ్యభూమి నీ విందు నిల్వ
నర్హ మనుటయు విని యమ్మహానుభావుఁ
డాత్మ నద్భుత మొంద నయ్యవసరమున. 31

తే. తత్ప్రదేశంబునందు నెంతయును వింత
మీఱఁగా నొకకుందేలు సారమేయ
మును మహోద్ధతిఁ దఱుమునబ్బురముఁ జూచి
యౌర యిది యద్భుతం బని యాత్మ నెఱిఁగి. 32

క. వీరక్షేత్రం బగు నిది
గారవమున నగర మిచటఁ గావింప శుభ
శ్రీ రంజిల్లు నటంచున్.
సారమతి న్సన్మహార్థచతురత వెలయన్. 33

సీ. కోట లాతెఱఁగంటిపాటలాధర లెల్ల
నాటలాడఁ దలంచ హౌసు మించ
మేడ లామిన్నేటిజాడ లానినయంచ
జోడు లాదటఁ గాంచుసౌబ గెసంగ
శాల లానవరత్న జాలలాలిత కాంతి
లీల రాగినవింత మేలు జూప
బాల లాహరుసిబాబాలలాగునఁ బల్కు
హేల లోఁగొనఁ జాలునితవు మీఱ

తే. నవుర నిర్మించెఁ దనపేర నఖిలలోక
పాలకపురాధికప్రభాబంధురముగ
గరిమ దనరంగ విద్యానగర మనంగ
మెఱయుపురరత్న మాధ రామరవరుండు. 34

క. అది మొదలిర్వదిపట్టము
లిదివఱకు నృపాలతిలక యిది మీదట న
ర్వదియేండ్లు వెలయునట్లుగ
మొదటన్ నిర్ణయ మొనర్చె మునివరుఁ డెలమిన్. 35

మ. అని యాడిండిమసార్వభౌమకవి ప్రఖ్యాతంబుగాఁ దత్పురా
ఘనవృత్తాంతము నెల్లఁదెల్పిన చమత్కారంబువీక్షించి యా
జననాథాగ్రణియున్ సభాసదులు నుత్సాహంబునన్మెచ్చికాం
చనభూషాదులొసంగి రెంతయుదయాసంరంభధౌరేయులై 36

వ. ఇవ్విధంబున నవ్వసుంధరారమణచంద్రుండు మహేంద్ర వైభవం
బునం బ్రత్యహంబునుం బూర్వసర్వసర్వంసహాధీశ్వర పుణ్యకథా
సుధాస్వాదనంబునం దృప్తి నందుచు సామ్రాజ్యసంపన్నుఁడై యుండి
యొక్కనాఁడు. 37

తే. తమరు పెద్దల రైతి రి త్తఱిని గృష్ణ
రాయ లనుపేరిమత్పుత్రి రత్నమునకుఁ
దనరఁ బట్టంబు గట్టెద ఘనత మీఱ
ననుచు నప్పాజితోన మంతనముఁ జేసి. 38

మ. సరసీజాక్షునిసత్కృపాగరిమచే సత్కీర్తి రాణించగా
ధరణీరక్షణదక్షతన్ వెలయుపుత్త్రిరమ్ము రమ్మంచు బం
గరుడాల్మొద్దమెఱుంగుటుంగరము వేడ్కన్ గృష్ణరాయక్షితీ
శ్వరుహస్తంబున నుంచె భూవరుఁడు రాజద్రాజధర్మస్థితిన్. 39

క. సత్త్రిజిద్ధరణీపతి
మిత్రుఁడు రత్నం బొసంగ మెఱసినరీతిన్
జిత్రముగఁ గృష్ణరాయధ
రిత్రీపతియుంగరంబు శ్రీ నొప్పారెన్. 40

సీ. ప్రణుతింప నతఁడు తోరణగట్టు పరసీమ
లనురీతి నూత్న తోరణము లెసఁగ
రిపుల ఖండించి సత్కృపఁ దత్సుతుల నిల్పు
నట్ల ద్వారములందు ననఁటు లమర
విలిఖించు నతఁడు దిక్కుల జయస్తంభాళి
ననుమాడ్కిఁ జిత్రధ్వహర్ర్వ లలర
వెలయు నిట్టితనికీర్తులు దిక్తటుల నన్న
సరణి ముత్తెపుమ్రుగ్గుజగ్గు లమర

తే. నభినవాలంకృతిస్ఫూర్తినతిశయించె
నప్పురీరత్న మపుడు మహాద్భుతముగఁ
బ్రకటమహిమల శ్రీకృష్ణరాయనృపతి
శ్రీకరం బైనపట్టాభిషేకవేళ. 41

మ. సరగం దెచ్చిరి భూసురోత్తములు కృష్ణాగౌతమీజాహ్నవీ
వరణాసూర్యసుతాకవేరతనయావారాశిముఖ్యాంబువుల్
గరిమం గాంచనరత్నకుంభతతులం గారుణ్యవిశ్వాసత
త్పరులై యెంతయుఁగృష్ణరాయవిలసద్రాజ్యాభిషేకార్థమై. 42

తే. శంఖకాహళభేరీప్రచండవాద్య
తతరవంబులు భూనభోంతరము నిండ
బ్రాహ్మణుల్ కృష్ణరాయధరావరునకుఁ
జెలఁగి పట్టాభిషేకంబు జేసి రెలమి. 43

సీ. చక్కెరవిలుకానిచక్కందనము గల్గి
చొక్క మౌనార్వేటిబుక్కరాజు
సాకల్యముగఁ గీర్తిసర్వదిక్తటులందుఁ
బ్రాకటస్థితి నిల్పునౌకువారు
కంటకరాజన్యగర్వంబు లణఁగించి
లీలచే మించునందేలవారు
ఘాటీనిరాఘాటఘోటీహతవిరోధి
కోటులై వెల్గువెల్గోటివారు

తే. చండతరశౌర్యు లగుకురాసానివారు
బూదహాలివారు మొదలైన భూమిపతులు
కొలువఁ బట్టాభిషిక్తుఁడై చెలువుమీఱె
రమ్యగుణపాళి శ్రీకృష్ణరాయశౌరి. 44

సీ అన్నన్న యతఁడు సింహాసనం బెక్కిన
నిభరాజు తా కొండ లెక్కఁదొడఁగె
నయ్యారె యతఁడు పట్టాభిషిక్తుండైన
సింధురాణ్ణేతముల్ చెమ్మగిల్లె

హైసరే యతని పేరనినమాత్రముననే
కురుదేశ మేల్రాజుగుండె లదరె
నోహో యతఁడు ఖడ్గ మొక్కింత ముట్టిన
సకలారిసంఘము ల్సంచలించె

తే. మాయురే నరసింహకుమారరామ
చంద్రశౌర్యనితాంతరాజత్సమాఖ్య
కృష్ణరాయాభిధానవర్ధిష్ణుఁ డేలు
ధర్మముల్ ధాత్రిఁబో యథార్థంబు గాఁగ. 45

శా. ఈరీతిం జతురబ్ధివేష్టితధరిత్రీశు ల్భజింపన్ మహా
ధీరుం డానరనాథచంద్రుఁడు యశస్తేజోవిలాసంబు లెం
తే రాణించ యుధిష్ఠిరుండు దగురీతిన్ ధన్యుఁడై యొక్కనాఁ
డారూఢి న్సభవార లెల్ల వినఁగా నప్పాజితో నిట్లనెన్. 46

తే. అవ్వ యీవఱదనుక సింహాసనంబు
భారము నృసింహరాయలవారు బూన
నిర్భరత మంటి నాయందు నిల్పెఁగాన
నఖిలకార్యస్థితుల్ దెల్పుమయ్య యిపుడు. 47

సీ. సింహాసనప్రభుశీల మేక్రియ నుండు
పాలించు టేరీతి ప్రజల నెల్ల
బాంధవపరిజనప్రతతిఁబ్రోచుట యెట్లు
ధనము లార్జించుసాధనము లేవి
యెటువలె వ్యయ మొనర్చుటకును మర్యాద
యేదారి శత్రుల నేపణంప
నాత్మరక్షణ కర్త లగుదు రెవ్వార లా
ప్తుల ననాప్తుల లెస్సఁ దెలియు టెటుల

తే. రాజలక్షణ మెయ్యది రాజ్యలక్ష్మి
శాశ్వతంబుగ నుండు టేసరణి రాజ
నీతు లెన్నివిధంబులు నిఖిల మెలమిఁ
దెలుపు మెంతయు నామది తేటపడఁగ. 48

మ. అను డామంత్రివరేణ్యుఁడిట్లనియెనయ్యా వింతగామీఱెఱుఁ
గనినీతిస్థితిధర్మరీతి గలదే కానిమ్ము నే విన్నయం
త నృపాలోత్తమ విన్నవింతు వినుమాదత్తావధానుండవై
ఘనసామ్రాజ్యసమాగమప్రకటసౌకర్యస్థితుల్ మించగన్ 49

తే. ప్రభుసమర్ధత సకల కార్యములకెపుడు
బలిమి నది వృద్ధిఁ బొందు నాప్తజనమంత్రి
వర్గబాంధవనిఖిలవిద్వత్కవీంద్ర
కృతసదాలోచనంబునఁ గృష్ణరాయ. 50

తే. స్వామ్యమాత్యసుహృత్కోశసకలరాష్ట్ర
దుర్గబలము లనంగి నెందును నృపాలు
నకును సప్తాంగబలములు నరవరేణ్య
వీనిఁ దెలియంగవలయును వేఱువేఱ. 51

తే. అధిప విను మయ్య మఱియు సప్తాంగము లగు
రాజ్యవాహనవస్త్రాభరణములు ఘన
సారతాంబూలములు మొదల్ జనపతులకుఁ
దెలియవలె ననియును మదిఁ దేటపడఁగ. 52

ఆ. ధరణిసామభేదదానదండంబులు
మాయయును నుపేక్ష మఱి మహేంద్ర
జాలమును ననంగ సప్తమహోపాయ
ములను దెలియఁ దగును ముద మెలర్ప. 53

తే. బోఁటి జూదంబు పానంబు వేఁట జనుట
తిట్టుటయ హేతువుగను దండించఁ దలచు
టౌచితి దొఱంగి యనుచితం బైనవ్యయము
సేయుటయు నివి వ్యసనము ల్పాయవలయు. 54

ఆ. ధనముఁ బాఁతిపెట్టి దైవాలయము గట్టి
వనము వేసి పెండ్లి వడుగుఁ జేసి
ధరఁ దటాకతతులు ద్రవ్వించి పుత్త్రులఁ
గాంచవలయు ధరణికాంతుఁడధిప. 55

క. సకలకవిరాజవిద్వ
త్ప్రకరము నితిహాసపరులు పౌరాణికులుం
బ్రకటపరిహాసకావళి
సుకరస్థితిఁగొల్వ నృపతి సొం పొందవలెన్. 56

తే. సప్తసాగరపరివృతసకలధరణి
విలసితాష్టాదశద్వీపములను తనదు
ఘనతరయశంబును బ్రతాపగరిమ మెఱయ
నృపతి చెలువొందవలయు మనీషివినుత. 57

తే. సప్తకులపర్వతంబుల సప్తఋషుల
మహిమ లన్నియు వినుచు సంపదలు మీఱఁ
జక్రవర్తులచరితంబు సకలరాజ
పుణ్యకథలను వినఁదగు భూవిభుండు. 58

వ. మఱియు నాస్తిక్యంబు నప్రసాదంబు నాలస్యంబు మొదలయినగుణం
బుల నుపేక్షించుచు మంత్రంబుల రక్షించుచు శుభకార్యంబు లొనరించుచు
దుష్టనిగ్రహశిష్టపరిపాలనంబుఁ జేయుచు సత్యంబు దప్పక యున్న
మహీవరులకు రాజ్యంబు సమృద్ధం బగు సమయోచితవర్షంబులు గురియు

సర్వసస్యంబులు మెఱయు భాండాగారంబులధనంబునెరయుఁ గావున నీవు ధర్మస్థితిం బ్రజాపాలనంబు సేయు మనిన విని యమ్మహీరమణుం డమ్మంత్రిపుంగవున కిట్లనియె. 59

క. గురుఁ డింద్రునకుం దెచ్చిన
సరణిన్ బహునీతి ధర్మశాస్త్రస్ఫురణం
బెఱిఁగించితి వెంతయు సు
స్థిరమతి నింతయుగ్రహించితిన్ మంత్రిమణీ! 60

తే. వీరనరసింహరాయలవారు మున్ను
పాలన మొనర్చు దేశముల్ ప్రబలదుర్గ
ములును సత్పుణ్యజనపదంబులును బేము
చూడవలయును మిక్కిలి వేడు కలర. 61

మ. అనుఁడమ్మంత్రివరేణ్యుఁడిట్టులనెనయ్యామంచికార్యంబయే
లినవా రియ్యెడ నానతిచ్చినది మేలే మున్ను మీ పెద్ద లే
లినరాజ్యావని వింత లెల్లఁ గనుట న్నే విన్నవించం దలం
చినకార్యంబు తనంతనేపొదమె మీచిత్తంబున న్భూవరా. 62

ఉ. నావుడుఁగృష్ణరాయలు మనంబు ఘనంబగు వేడ్కఁజెంద నా
నావిధకార్యనిర్వహణనైపుణి గల్గినధీరులం బుర
శ్రీవెలయంగ దిట్ట మొనరించి రయం బెసఁగన్ దిగంతర
క్ష్మావరవర్తనం బెఱుఁగఁ జారులఁ బంచె సమంచితోన్నతిన్.

ఉ. ధీరత నర్ధరాత్రమునఁ ద్రిమ్మరు నప్పురవీథులందు నె
వ్వారలు వింతరీతి గలవాక్కులు బల్కుదురో యటంచు వి
స్తారతమోదశద్రుచిసుజాగ్రిదదగ్రభుజాగ్రఖడ్గుఁ డై
తోరపువేడ్కతో నతనితో సరి రాఁ గలరే ధరాధిపుల్.

వ. వెండియు నమ్మహీరమణవర్యుం డొక్కనాఁడు 65

క. కొలిచినవారలకుం గల
కొలఁదికి నెక్కువగ బలము గూర్చిన సేనా
బల మధికం బగు ననుచుం
గొలువునకు న్వచ్చి మిగులఁ గుతుకం బలరన్. 66

తే. సంప్రతులఁ బిల్చి యెన్ని లక్షలకుఁ గలదు
రాజ్య మెన్నెన్ని గలవు దుర్గస్థలములు
బొక్కసంబునఁ గలధనభూషణాది
వస్తువులు నశ్వవేదండవర్గ మెంత. 67

క. నవముగ లెక్కలు దెం డని
వివిధగతుల నొరసి యొరసి విద్యారణ్యా
దివిభుత్వార్జితరీతులు
వివరంబుగ వేఱువేఱ వివరింపు డనన్. 68

తే. పురము గావించునప్పు డమ్మునివరుండు
గూర్చినరూక తొంబదియాఱుకోట్లు
గురుమణివిభూష లొకనాల్గుకోట్లు గలవు
రాజదేవేంద్ర శ్రీకృష్ణరాయచంద్ర. 69

క. వినుఁ డీవరకున్ సింహా
సన మేలినన్నృపులు బొక్కసము గూర్చినసొ
మ్మెనయఁగ దొమ్మిదికోట్లకు
నను వై యున్నదిధరాతలాధిపతిలకా. 70

చ. ఎనుబదినాల్గులక్షలకు నెన్నఁగఁ గన్నడరాజ్య మందులో
ననువుగ దేవదాయవసుధామకదాయము లెన్న నేల ని
ల్చినవరహాలకున్ గణనజెప్పెద వెయ్యిజిరాగురాల కిం
పొనరఁగ లక్షవంతున మహోన్నతి నిర్వదినాల్గువేలకున్.

క. ఇరువదినాలుగులక్షలు
కరికి న్వేయ్యింటిలెక్క గలనూఱుఘటల్
మెఱయఁగ ద్వాదశలక్షలు
వరహాల్ నిర్ణయముసుమ్ము వసుధాధీశా. 72

తే. భటులు వెయ్యింటి కెన్న నిర్వదియు నాల్గు
వేలుగా లక్షయర్వదివేల ప్రజకుఁ
జెల్లు నల్బదిలక్షలు జీతమనఘ
యపర నేలేడిదొరల కీక్రమమె సుమ్మి. 73

వ. ఇవ్విధంబునకుం దగినచందంబున భవదీయభుజాపరిపాలితం బైన కృష్ణాకావేరీమధ్యస్థిత దేశంబునం గల నిఖిలశైల స్థలదుర్గంబుల కధిపతు లై తత్తద్దేశంబు లనుభవించుచుం గొందఱున్నృపాలవరులు సింహాసనంబునం గొలిచియున్నవా రని సంప్రతిజనంబులు విన్నవించి మఱియు నిట్లనిరి. 74

క. ఈలేఖప్రకారమునకుఁ
జాలఁగఁ జతురంగబలము సరిచూడఁ దగున్
వాలాయము కొలిచినభూ
పాలురదుర్గములఁ గాంచి పాలింప దగున్. 75

తే. అనుచుఁ బలుకంగ విని తనయాత్మలోన
నగరికై జీతముగను లేఖ గణుతింప
నేమియును దెల్పఁగా లే దిదేమి యనుచు
నప్పు డప్పాజితోడ నిట్లనుచుఁ బలికె. 76

తే. అరయ నిటమీఁదఁ దగినకార్యముల కెల్ల
నడపవలసినయాలోచనక్రమంబుఁ
జేయు మెట్లన్న నతఁడు మీచిత్తమునకు
వచ్చినట్లనె నడచు సర్వంబు ననియె.

మ. అను డాకన్నదరాయశేఖరుఁడు రాయల్ నన్నుసింహాసనం
బునకుం గర్తను జేసెఁ గాపరిజనంబుల్ చాలస్వాతంత్ర్యవృ
త్తిన బ్రాబల్యముగాఁ జెలంగఁ గలరింతే యిప్పుడేనేమనం
గొనసాగంగలదేయటంచుమదిలోగూఢాశయంబొప్పఁగన్. 78

వ అన్నగరశోధనార్థంబుగాఁ జనిన ట్లంతఃపురంబు వెడలి తత్పురంబున కనతిదూరంబున నొక్కదేవస్థలంబుఁ గని యందొక్కరుండునుం బ్రవేశించి స్థానికు లొసంగు పరిమళజలంబుల నాని తీర్థం బొనరించి తద్దేవతార్థంబు లగుప్రసాదంబు లుపయోగించి కృతాచమనుం డై పట్టణంబు చాయం గనుంగొనుచు సుఖాసీనుం డై యుండు నంత. 79

మ. దొరయెచ్చోవసియించినాఁడొయనియెంతోవేగనల్దిక్కులం
దరయ న్వేగులవారిఁ బంపుచు రహస్యప్రౌఢినొక్కండు ద
త్సరణిం దెల్ప నెఱింగి వచ్చునతనిందా దవ్వులం గాంచియ
ద్ధరణీనాయకుఁ డల్కఁ జెన్నొలయ నిద్రారీతితోనుండఁగన్. 80

ఆ. సన్నిధానమునకుఁ జని కృతాంజలి యైన
మంత్రివరుని జూచి మనుజనాథుఁ
డిటకు మీర లిప్పు డేమి వచ్చితి రన
భయము వినయ మెనయఁ బల్కె నతడుఁ. 81

శా. స్వామీ వీరనృసింహభూవరసుధావారాశిచంద్రోదయా
శ్రీమత్కీర్తివిశుద్ధకాంతిజయసాంద్రీభూతచంద్రోదయా
భామామన్మథమన్మథారినిభసంపచ్ఛౌర్యభాస్వద్దయా
ప్రేమల్ మీఱఁగనన్నుగన్గొనుము పేర్మింగృష్ణరాయాధిపా. 82

క. మీ రిట వచ్చుటెఱుంగక
నారయుచు న్నగరిలో రహస్యం బెసఁగం

జారుఁ డొకఁడు మీవచ్చిన
దారిం దెలుపంగ విని ముదం బలరారెన్. 83

తే. పౌరు లగుజను లెవ్వరి వార్త వినక
యుండునట్లుగ మృగయార్థ ముర్విరమణుఁ
డరుగుచున్నాఁడు మీరలు నరుగుదెం డ
టంచు దొరలకుఁ బత్త్రిక లంపి యిటకు. 84

క. వచ్చితి మీచిత్తమునకు
వచ్చినగతి నడచు సకలవైభవములచే
హెచ్చుగఁ బురిలోనుం డిట
విచ్చలవిడి వత్తురే వివేకనిధానా. 85

తే. అధిప యివ్వార్తపరు లెవ్వరైన వినిన
వైపరీత్యంబు గాదె సర్వంబు నెఱుఁగు
నట్టిధన్యులు మీర లి ట్లన్యజనుల
సరణి రాఁ జెల్లునే సాధుజనశరణ్య. 86

వ. అనిన నమ్మహీశ్వరుం డతనిం గనుంగొని. 87

క. క్షితినఘటనఘటనసమ
ర్థత గలమీవంటిసత్ప్రధానులు గలుగన్
మతి మా కేమి విచారము
సతత మొనర్తుము యథేష్టసంచారంబున్ 88

తే. తృణము మేరు వొనర్తుర క్షణములోన
మేరు వైనను దృణ మౌను మీర గాద
టన్న సామాజికులకు సామర్థ్య మధిక
మగుట వసుధాప్రభువులభాగ్యంబుసుమ్ము 89

మ. అను డారాయలవారితోఁబలికెనయ్యప్పాజియోస్వామియే
మనఁగా నెంతటివారమయ్య భవదీయాజ్ఞావిలాసంబులో
ననువొంద న్భయభక్తుల న్మెలఁగినట్లైనం గృపం జూడు కొ
ల్చినవారెచ్చటనైన భూపతులకు న్శిక్షార్హు లెంచ ధరన్. 90

తే. లలిఁ దృణగ్రాహి యైనసీలమున కరయ
విలువ యధికంబు తృణ మని విడిచినంత
జాతినీలంబు గా దన్న సరణి ధరణి
ప్రభువులు పరిగ్రహించిన ప్రజలు ఘనులు. 91

ఉ. కావున మీ ప్రతాపమునఁగాక సమర్థత వేఱె కల్గునా
దేవరవార లి ట్లనినఁ దెల్పుకొనంగ సమర్థు లెవ్వరో
భూవర మీర లేక్రియను బుద్ధిగఁ జెప్పిన నాక్రమంబునన్
దేవ సమస్తకార్యములు దీర్చెద రమ్ము పురమ్ము జేరఁగన్. 92

క. అని భయము నయము వినయం
బెనయం దెల్పుకొనునతనిహితవాక్యంబుల్
విని కృష్ణరాయఁ డిట్లనె
ఘనతరకారుణ్యగరిమ కడలుకొనంగన్. 93

ఆ. దుష్టనిగ్రహంబు శిష్టపాలనమును
జేయు మనుచు మీరు జెప్పినట్టి
నీతిరీతి నడుచు నియతికిఁ దగినమా
ర్గంబు గన్న వత్తు ఘనత నిపుడు 94

చ. అన విని సాళ్వతిమ్మసచివాగ్రణి రాయలవారితోడ ని
ట్లనియెఁ బరాకు మీరలిపు డానతియిచ్చినదెంతయున్నిజం
బెనయఁగఁ గార్యరీతి యిదమిత్థ మటన్న ఘటించెద న్భవ
ద్ఘనతరదృష్టికి న్నిలుచుకార్యము లెయ్యవి రాజశేఖరా. 95

తే. అనిన రాయలు వల్కె నయ్యనఘుతోడ
గట్టికై జీత మిప్పుడు గట్టి చుటు
ముట్టి బెట్టుగఁ దురకలపట్టణములు
గొట్టి సాధించవలయు గగ్గోలుపడఁగ. 96

క. ధీమంతు లయినప్రభువులు
సామంతులబలముకన్న స్వంతము బలముల్
తా మెంతయుఁ గూర్చినచో
శ్రీమంతు లటన్ననీతిఁ జెప్పఁగ వినవే. 97

క. నా విని యామంత్రీశ్వరుఁ
డీవింత యి దెంత కార్య మిందుకుఁగా మీ
రీవిధమున రావలెనా
కావించెద మీరు దలఁచుకార్యము లెల్లన్. 98

వ. అని యాక్షణంబ యాక్షితినాథుండు వీక్షించుచు నుండ నయ్యుద్దండ దండనాథుండు నిండుచాతుర్యంబు మెఱయ సుధీచమత్కారంబు నెరయ సకలజనంబులకు భయంబు నెఱయ రయంబున నయం బెన యుచందంబున ధర్మంబు దనరునందంబున డెందంబున నమందా నందంబు క్రందుకొన నెందెందుఁ గలధరాపురందరులం బిలువం బంపి చతురంగబలంబుల నెన్నిక జూపించి లెక్కకున్ మిక్కిలి యెక్కువ యగునక్కొలందికిం దగినరొక్కంబులు గ్రక్కునం గొని బొక్కసంబుల గ్రిక్కిఱియ నుంచి మించి బహు దినములనుంచి యనుభవించిన దేశంబు లెంచి మంచి దొరల మంచిదొరలు పెక్కాచా రంబుగ సారంబుగల నేరంబు పరిహరించిన ధనంబులు తిరుగఁ దెమ్మనిన నమ్మనుజపతులు సొమ్మను రిమ్మగా ఘనమ్ముగ గంధ సింధురసైంధవ సముద్భట భటవ్రాతంబునడుకట్టునం గట్టికొవి దట్టం

బులయిన వేదండంబు లేనూఱును, పది రెండువేలు కాండ ప్రకాండం
బులు, ప్రచండశౌర్యదోర్దండు లగునఱువదివేల భటుల, చటులగతి
నేలుమేలుగలనృపాలుర నగరివశంబు జేసినం జూచి మెచ్చు విచ్చల
విడి బహుమానంబుగ మెచ్చు గలపచ్చరామెచ్చు రాణించు హెచ్చు
విలువకడెంబులు కపురంపు విడెంబులు జాంబూనదాంబరంబు లొసంగి
చతురంగబలంబులు గొలువ నైరావణోపమానం బయిన దంతావ
ళంబు సమారోహణంబు గావించి యమ్మంత్రిమాణిక్యంబుతోడం
గూడి నిజరాజధానిం బ్రవేశించి యందఱ నిజనివాసంబులకుం బంచి
యప్పంచశరరూపరేఖావిరాజ మానుం డగు వీరనృసింహరాయకు
మార కుమారవిక్రమాభిరామ కృష్ణరాయమహీమహేంద్రుండు కొలు
వుండి వెండియు నొక్కనాఁడు. 99

తే. తలఁచినట్లనె చతురంగబలముఁ గూర్చి
ధరణి నఘటనఘటనచాతురి చెలంగె
సాళ్వతిమ్మరుసయ్యకు సాటి యైన
మంత్రివర్యుండు గలఁడె యిమ్మహిని రహిని 100

క. ఘనుఁ డీయన నవరణచే
సినగజహయములక్రయంబు చింతింపంగా
వినుఁడీ నలుబదిలక్షల
ధన మౌరా యింతమహిమ ధరణిం గలదే 101

క. అమరేంద్రునకు బృహస్పతి
యమరిచినటులం బ్రభుత్వ మమరెఁగదా నేఁ
డమరపుప్రభువులు గొలువఁగ
నమరుదరికృపానిరూఢి నలరఁగఁ గలిగెన్. 102

మ. అన నప్పల్కులకు న్సభాసదులు మేలాహా సెబాసయ్యభూ
జనరక్షాపరుఁ డౌనరేంద్రునకు రాజత్ప్రౌఢిమన్ మీరుమం

త్రనిగూఢాశయమంత్రిరత్నము కరస్థం బైనవక్రార్థతా
రినృపాలాహిభయం బొనర్చు టరుదే శ్రీకృష్ణ రాయాధిపా.

చ. కరచరణాదు లందఱికిఁ గల్గినయంతటనే సమర్థతన్
మెఱవడిఁ గాంచ నేర్తురె మనీషివరుల్ ధరలోన నెవ్వ రి
క్కరణి ఘటించుచుం గృతయుగంబునఁ ద్రేతనుద్వాపరంబు
నం,దరయఁగ సాళ్వతిమ్మసచివాగ్రణికి న్సమమంత్రి కల్గునే. 104

క. ధరలోన మంత్రిరత్నము
నరనాథుఁడు సంతరించినన్ మణితురగ
ద్విరదవధూజనముల వి
స్ఫురితగతిన్ గలుగఁ జేయు బుద్ధిప్రౌఢిన్. 105

క. విను పంచలోహములలో
నను బంగారంబు హెచ్చనందగునటులన్
మనుజులలో సామర్థ్యం
బెనసినసద్బుద్ధిమతు నెన్నఁగ వలయున్. 106

ఆ. శతసహస్రసంఖ్యజనులలో నొక్కఁశూ
రుండుఁ బండితేంద్రుఁ డుండు టరిది
వక్తయైనవాఁడు వర్ణింప వేవేలఁ
గలుగు టరిది దాత గలఁడొ లేఁడొ. 107

క. అనునట్టిరీతిసీతిన్
ఘనవాగ్జాలతయు సకలకార్యధురీణ
త్వనిరూఢియుఁ గలమంత్రులు
జననాథునికరుణ గలుగ జగతిం గలరొ. 108

క. అని యయ్యమరుసు మొదలుగ
జననాథునితోడ నాప్తసరసోక్తితతుల్

దనరఁగ బలుకుచు నుండఁగ
ననుపమగతి గూఢచారుఁడాసమయమునన్. 109

ఉ. వచ్చి విజాపురిం గలుగువార్తలు దెల్పఁ దొణంగెభూవిభుం
డచ్చటిమందియున్ మిగుల నద్భుతమంది వినంగ నెంతయున్
హెచ్చరి కయ్య స్వామి ధరణీశ పరాకు పరా కటంచుభా
స్వచ్చతురోక్తివైభవవిశాలసుధీయుతుఁ డై చెలంగుచున్. 110

పంచచామరము

నిజాముశాహువారలున్ మనీషశేషతుల్యు లౌ
వజీర్లు గల్గుగోలకొండ వారిభూరిమంత్రులున్
గజాధినాథుపేర చాలఁ గాగిదమ్ము లంపుచున్
విజాపురమ్ములోనఁ గూడి వేడుకల్ దలిర్పఁగన్. 111

క. ఒద్ద న్వెంకోజి యనాఁ
దద్దయుఁ బెద్ద యనఁ దగినదాదోజి యనా
నిద్ధఱుమంత్రులు నొండొరు
లొద్దికమై రాత్రి పగలు నూహల్ మిగులన్. 112

ఉ. వీరనృసింహరాయమణి వేడుకతోడుతఁ గృష్ణరాయలం
గోరికమీఱ రాజ్యమునకుం దొరఁ జేసిననాఁటనుండియున్
వీరుఁడతండు శాత్రవులవెంటఁబడంగఁదలంచు టెంతయున్
గౌరవమొప్పనచ్చటిముఖాములువ్రాయదొణంగి రెంతయున్ 113

క. సింహాసనముల నరపతి
సింహావళి కధిక మహిమఁ జెన్నొందె సుమీ
సంహృతదుశ్శీలుం డగు
నంహోహరుఁడైనవేంకటాద్రీశుకృపన్. 114

తే. అనుచు నొకకొంద ఱెక్కువ యనఁగ నేమి
యనియును సమంబె యనుచు నన్యోన్యకలహ
మంది క్రమ్మఱఁ దెలివంది యధికుఁ డెందు
నరపతి యటంచుఁ బలికిన నయ మెసంగ. 115

ఉ. ఎక్కడ జూచిన న్సురమునీశ్వరమందిరశైలపంక్తు లే
దిక్కునఁ గన్గొనన్ ధరణిదేవనివాసమహాగ్రహారముల్
మిక్కుట మౌనదు ల్గలుగుమేదినిఁ బ్రోచు నరాధినాయకుం
డెక్కడ యీతురుష్కవిభు లెక్కడ రాయలతోడసాటియే. 116

తే. నకులలోన నరాధిపస్ఫురణ మెనయు
నతఁడు నే నని భగవంతుఁ డనినవాక్య
మెఱుఁగరె తదంశజుండు శ్రీ కృష్ణరాయ
లెంచి చూచిన సామాన్యనృపుఁడె మహిని. 117

ఉ. కాదన నేల గాఁగలుగుకార్యములౌనె గదా యి దెంతయున్
మోదమెలర్పఁగా నిపుడు ముందుగఁ దెల్పుట మేలటంచున
య్యేదులశాహుతో దెలుప నెంతయు నద్భుతమందివారితో
వాదములాడుచుంగినిసివాడనియెన్ దురహంక్రియార్భటిన్ 118

శా. ఆసింహాసన మేలునట్టినృపు లాహా తొల్లి శౌర్యంబుతో
నీసీమ ల్దిలకింప నేర్చిరె మఱేమీ కృష్ణరాయండు నేఁ
డాసన్వచ్చినవచ్చుగాని భయమే యస్మన్ని రాఘాటఘో
టీసంఘంబులముంగల న్నిలువఁగా ఢిల్లీశుఁడున్ శక్తుఁడే. 119

తే. అనుచుఁ బ్రజ మెచ్చఁగోఁగ బాహ్యమునఁ బలికి
యంతరంగంబులోఁ జాల నళుకుఁ జెంది
బెగ్గడిల్లుచు జాబు లంపించె గోల
కొండకు నిజాముశాహునకు న్మహీశ. 120

శా. ఆమూఁడిండ్లదుసీలు నేక మగుసౌహార్దంబుతోఁ దావకీ
నామేయస్థిరకార్యనిర్వహణశౌర్యాంబుధి విన్నంత నే
సీమన్ దుర్గములందుఁ గోటలను విస్తీర్ణస్థితిన్ ధాన్యపున్
సామగ్రు ర్సమకూర్ప నెంచిరి నితాంతస్వాంతచాంచల్యులై. 121

ఉ. సాలవిశాలసాలఘనజాలములం దగు కొత్తళంబులం
జాలగఁ జాలుగా జబురుజంగి పిరంగులు నాదిగా దిగా
భీలగతి న్ఘటింపుచును భీకరు లైనవజీర్లు నిల్పుచున్
హాళిమెయిం జరించెద రయారె భవజ్జయధాటి కళ్కుచున్. 122

తే. ఎఱుక గలవారితరబడి నేఁగునపుడు
కరముల సిఖాలుజేసి ముష్కరతురుష్క
లవలఁ బొమ్మని కొత్వాల కప్పగింతు
రచ్చటికిఁ జేరఁ బరులకు నలవి గాదు. 123

తే. మద్యపానులు నున్మత్తమానసులును
విప్రజనదేవతాస్థలవిముఖు లగుటఁ
దావకీననితాంతయుద్ధమున కెదిరి
పోరఁగా లేరు తురకలు భూవరేణ్య 124

క. అని విన్నవించుసమయం
బున గజపతిసీమఁ జూడఁ బోయినచారుల్
జనుదెంచి ప్రణతు లై యి
ట్లని తెల్పం దొడఁగి రచటివృత్తాంతంబున్. 125

చ. జయజయ కృష్ణరాయనృపచంద్ర పురందరభోగసాంద్ర మీ
దయను గళింగదేశవసుధాపతివర్తన మెంతయున్ మహో
దయమునఁ గాంచి వచ్చితిమి రాజవరేణ్యుఁడతండు సంతత
ప్రియకరుఁడాశ్రితావనగరిష్ఠగుణాభరణుండు చూడఁగన్. 126

సీ. కుందబృందనవారవిందముల్ జెన్నొంది
యంద మొప్పొందఘక్కచందువాలు
పచ్చడాల్ హెచ్చు రాగచ్ఛ రాణించుడాల్
ముచ్చటల్మించ మేల్మచ్చగములు
కల్వరా చెల్వగ రా విల్వ రాణించుక్రొం
జల్వ రాజిలుగొప్పచప్పరములు
నిందిరామంది రానంద రాజన్మహా
మందిరాదికగృహాళిందములును

తే నెందుఁ గనుఁగొన్న కన్నులవిం దొనర్చు
నౌర గోదావరీవారిపూరవర్ధి
తామితారామసర్వసస్యాభిరామ
నవ్యగుణధామ యాజగన్నాథసీమ 127

తే. అలజగన్నాథునిప్రసాద మఖిలజనులు
సృష్టిదోషంబు లేక భుజింపవలయు
నన్మహావైభవంబు బ్రహ్మాదులకును
సన్నుతింపఁగ శక్యమే జనవరేణ్య 128

ఉ. ధీయుతుఁ డాముకుందగజదేవు నిరంతర మెంతయున్ జగ
న్నాయకులన్భజింపుచుజనంబుల(బ్రోచుచునుండియొక్కనాఁ
డాయతసౌధమంటపమునందు నిజాశ్రితు లెల్లఁగొల్వఁగా
శ్రీ యలరంగ సింహమణి చిహ్నితపీఠమున న్వసింపఁగన్. 129

ఉ. అల్లనిజాముశాహుసచివాగ్రణి యిట్లనె నాన్నృపాలుతోఁ
జెల్లుగఁ గృష్ణరాయనృప శేఖరుఁ డన్యనృపాలచిత్తముల్
ఝల్లన గోలకొండయు విజాపురమున్ బెదరన్ జనావళుల్
ఘొల్లన దాడివచ్చుపలుకుల్ బలుకంగ దొణంగిరయ్యెడన్. 130

క. అలవిజయనగరిలోనం
గలవీరులమంత్రివరులు కాగిదములలో
పల వ్రాసి యంప దొణగిరి
తిలకింపఁగ నత్రమౌగతిం బ్రభుచంద్రా 131

క. ఆకర్ణాటకభూవరుఁ
డాకృష్ణకు నవల వచ్చినంతనె తురకల్
ప్రాకటహయధాటీగతి
భీకరముగ నెదిరెదరు గభీరస్ఫురణన్. 132

తే. ఆముదాపురపర్యంత మైన నిపుడు
మించి రాఁగల్గునతఁడు సమంచితగతి
మీరు మీదుర్గసీమల మేర మీఱ
వస్తుసామగ్రు లుంచిన శిస్తుగాదె. 133

తే. అనిన గజపతి యొక్కింత నాత్మ నెంచి
యలజగన్నాయకులె మాకుఁ గలఁ డటంచు
శత్రుభీకరమూర్తు లౌ క్షత్రపాత్ర
వరులతో మంతన మొనర్చి వరుసతోడ. 134

క. సరగునఁ దమదుర్గస్థల
వరభూములయందు సకలవస్తుప్రతతుల్
పరిపూర్ణస్థితి దనరం
గరితురగభటాళు లుంచె గాఢస్ఫురణన్. 135

శా. భూనాథోత్తమ యొక్కవింత గల దాభూభర్త గోదావరీ
స్నానార్థం బరుదెంచు వేగుఁ గని కొండం గల్గుపాశ్చాత్యపీ
రానీకంబులు జుట్టుముట్టుటయు శౌర్యస్ఫూర్తి శోభిల్ల వే
గానన్ నల్గురుక్షత్రియుల్ గణగిఁ బీకంగూల్చిరమ్ముక్కఁకలన్. 136

మ. ఆదియుంగాక మహావిచిత్రములు దేవాయొక్క పాత్రుంతుబు
ట్టిరమౌఖడ్గహతిన్మహీరుహముఖండించెన్మహాద్ధత్యసం

పద ఘోటిందుమికించె నొక్కడు ఘనాంభ స్సేతుమధ్యోర్వియా
సదయుండెంతయు మెచ్చివారికొసగెన్సద్భూషణవ్రాతముల్. 137

తె. అలపదార్గురురాజులే యిలను వేడ్క
నిట్టిక్షత్రియపాత్రులై పుట్టిరొక్కొ
కా దనిన నింతదోస్సారగరిమ గలదె
కృష్ణరాయక్షితీంద్ర సత్కీర్తిసాంద్ర. 138

ఆ. విన్న కన్న కొన్ని వింత లెంతయు మీకుఁ
దెలుప వలయుఁ గానఁ దేటపడఁగ
విన్నవించినార మిన్ని యాకర్ణించి
కొంచె మనక చిత్తగించవలయు. 139

వ. అని యివ్విధంబునఁ దెలుపుచారుల వాక్యంబు విని యద్భుతంబున నమ్మహీరమణుండు బహుమానం బొనరించి వారలం బంచి యప్పాజి మొదలగు మంత్రులఁ గాంచి సమంచిత ప్రకారంబున నిట్లనియె. 140

ఉ. దిక్కులఁ గల్గువార్తలట తేటపడ న్వినినట్లు యయ్యెఁగా
నిక్కడ సేయఁగల్గుపనులెయ్యవి తెల్పుఁడటన్న నెంతయున్
మక్కువతోడ నిట్లనిరి మంత్రి శిఖామణు లానృపాలుతో
వాక్కులకంఠకంఠికరవల్లకిసల్లలితో క్తివైఖరిన్. 141

తే. వీరనరసింహ రాయకుమార నీదు
పేరు విన్నంత గజరాజు బెగ్గడిలఁడె
యిల జగన్నాథభక్తుఁ డై వెలయునతని
నెలమి దయసేయఁ దగు నీకుఁ గృష్ణరాయ. 142

క. దేవబ్రాహ్మణభక్తి
ప్రావీణ్యము గనినయతనిబంధుత్వమునన్
ఖావింపుము సత్కీర్తుల
తీవిగ నెదిరింపుమయ్య ఢిల్లీశ్వరుతోన్. 143

ఉ. నావుఁడుగృష్ణరాయనరనాథుఁడుమంత్రులమాట కెంతయున్
భావమునం జెలంగి నిజబంధుతతిం బిలిపించి మేటిసం
భావనఁ జేయుచున్ ఘనతఁ బంతిని విందొనరించి సర్వసే
నావళితోడఁ గొల్చినధరాధిపవర్యుల గారవింపుచున్. 144

చ. మెఱుగుకడెంబులుందళుకుమించినకంఠసరుల్దురాయులున్
సరిపెణ లుంగరంబులును నాల్గునగల్ చరణాంగదంబులుం
దురగములాదిగాఁగ దయతో బిరుదుల్ వెలయంగనిచ్చెనం
దఱికి నృపాలశేఖరుఁ డుదారసువారచితోక్తివైఖరిన్. 145

మ. పురసఃరక్షణదక్షు లౌజనులకున్ బుద్ధిస్థితుల్ దెల్పి భూ
సురసందర్శితదివ్యలగ్నమహిమల్ బొల్పొంద నందంబుతో
స్థిరశౌర్యోన్నతిజృంభమాణగరిమన్దిగ్జైత్రయాత్రామతిన్
వెరవొప్పం బురిచెంతలన్వెలిగుడార్వేయంగఁబంచెన్వెసన్. 146

ఉ. పంచి సమంచితస్థితిసభాసదుల న్విలసత్కృప న్విలో
కించి ధరామరేంద్రులకుఁగీర్తిచెలంగ సమస్తవస్తువుల్
మించినవేడ్కఁ దానము లమేయగతిన్ ఘటియించి విస్ఫుర
త్కాంచనభూషణావళితతద్యుతిరంజితదివ్యమూర్తియై. 147

చ. వరమతి సద్గుణప్రకటవైభవనిర్జితశారదాంబ యౌ
తిరుమలదేవి కప్పురపుదీవెనవీడె మొసంగి పంపఁగా
నరవరమౌళి దివ్యశకునమ్ములు గన్పడ భద్రదంతిపై
సరగుననెక్కిఛత్రమును చామరము ల్మెఱయంగనెంతయున్ 148

సీ. అనవద్యచిత్రవాద్యస్వనంబులతోడ
భేరీవిరావము ల్బోరుకలఁగ
గంధేభఘీంకారఘనతరధ్వనితోడఁ
దురగహేషారవస్ఫురణ మెనయ

వరభూసురాశీరవప్రభావముతోడ
వందిమాగధశబ్దబృంద మొనర
సకలాభరణపంక్తి చకచకద్ద్యుతితోడ
సురుచిరాయుధదీప్తి సొబగు మీఱ 148

తే. సరసమన్నీలు దుముదార్లు చతురవితత
సకలసేనాసమేతులై సందడింప
రమణఁ జెలువొందు రాజమార్గమున వచ్చె
రమ్యగుణపాళి శ్రీకృష్ణరాయమౌళి 149

తే. అతనిమహిమకుఁ జాల నద్భుతము నొంది
విరులవానను గురియించువేల్పు లనఁగ
విమలసౌధాగ్రములనుండి వేడు కలర
సేసజల్లిరి పురిలోనిచెలువ లపుడు. 150

వ. తదనంతరః థావృత్తాంతం బెట్టిదనిన. 151

క. దివిజేంద్రతనయహరణా
రవిసుతసంరక్షణాతిరాజత్కరుణా
ప్రవిమలవాల్మీకివచః
కవనస్తుతిభరణకీర్తికలితస్ఫురణా. 152

ఉ. రావణకుంభకర్ణరణరంగమహాంగణలీఢగాఢబా
ణావళిదీప్తిరాజితదిశాంతరశాంతిరసైకవిస్ఫుర
ద్భావసమాధిగమ్య నిజభావనిరంతరసంశ్రితావళీ
శ్రీవిభవప్రదానచణసిద్ధభుజోర్థ్వ మహీధురంధరా.

భుజంగప్రయాతము.

విరాజత్సదార్వీటివేంగక్షమాధీ
శ్వరస్తుత్య సస్మితపైరిప్రభావా

ఖరారీ కుభృత్కన్యకావర్ణ్యనామా
శరశ్చంద్రికావాసనన్మందహాసా. 154

గద్యము. ఇది శ్రీమదోరుగంటి కాశీపతిసద్గురు రాజయోగీంద్ర చరణారవింద మనోవిహార నిరంతరానందకర రాజయోగ సామ్రాజ్యలక్ష్మీధురంధర స్వస్వరూపానుభవసంపన్న జ్ఞానప్రసూనాంబికా కాళహస్తీశ్వరకరుణా కటాక్షవీక్షణప్రసాదాసాదితకవితాచమత్కార ధూర్జటిపౌత్ర కాళయామాత్య లక్ష్మ్యంబికాదత్త పోలనమంత్రి.సుర్వమాంబికా కుమార ధూర్జటి ప్రణీతం బైన శ్రీకృష్ణరాయవిజయం బనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.



శ్రీ ర స్తు

# కృ ష్ణ రా య వి జ య ము

## తృతీయాశ్వాసము

శ్రీ చినవేంకటరాయ ధ
రాచక్రేశ్వర మనోజ్ఞాజద్భృంగా
యాచతురాననవినుత
ప్రాచుర్యగుణాలవాల రామ కృపాంగ్యా. 1

వ. అవధరింపుము. 2

క. ఇటువలెఁ బురంబు వెలువడి
పటగృహమున నిలిచి ఘనశుభప్రదవేళం
జటులచతురంగసేనా
ర్భటు లెసఁగ న్నడిచె దిశలఁ బ్రతిరవ మడరన్. 3

మ. చని ప్రాగ్దక్షిణపశ్చిమోత్తరవిదిగ్జాలంబునన్ వైరివీ
రనృపాలావనిఁ జుట్టుముట్టుకొని యా రాజ్యంబునం గల్గుగో
ధనము ల్మ్రుందటిమూఁక లాఁగినను మాద్యల్లీలతో సర్వసై
న్యనిరూఢిం దదధీశు లెంతయును జన్యప్రౌఢిమం గ్రమ్మినన్. 4

సీ. దళితదిక్తటనట త్పట పెటార్భటులతో
ఘోరమైనతుపాకిగుండ్లచేత
దవ్వుదవ్వున హెచ్చి రివ్వురివ్వున వచ్చి
ప్రసరించురామూరిబాణములను

పెల్లుగా వెసజిత్తజల్లుగా వెదజల్లు
పెంపరుల్ బెంపారునంపగవాఁ
ధాటీగతి నటింప మాటికి సూటిగా
నాటుకొన్ బల్లెంపుటీటిగముల 4

తే. నఱిమి తఱిమిన భయమున విఱిగి జరగి
నిజబలంబులఁ దాకకు నిల్వలేక
శరణు జొచ్చినవారలఁ గరుణఁ జూచి
యుచటిదుర్గస్థలంబుల నాక్రమించి. 5

వ. అనంతరం బొక్కహూరుమత్తున నుమ్మత్తూరు శివసముద్రస్థలంబుల నెసంగు గంగరాజు నొడయల నోడించి తదీయ స్థలంబున నాణెంబులు, జలియించి శ్రీరంగపట్టణంబు నిరీక్షించి యక్కడినుండి గ్రక్కున నెక్కటిమూఁకల వెక్కనపు బరాక్రమక్రీడల దిక్కులు గ్రక్కదల సంకులసంరంభసైన్య నాయకుం డగు సంకులనాయకునిం గటాక్షించి చంచత్ప్రతాపంబు మెఱయ రయంబున విజాపురంబు గడిదుర్గంబుల చాయం జనుదెంచుసమయంబున. 6

ఉ. శ్రీల వెలుఁగునానృపతిశేఖరుదాడికి నిల్వ కెంతయున్
జాలినిఁ బొంది యచ్చటిరసాతలనాయకు లాత్మలన్ మహాం
దోళనమంది కోటలును దుర్గములుం గయికొమ్మటంచు ను
ద్వేలభయంబునన్శరణు వేడుచు కానుకలిచ్చి మ్రొక్కనన్. 7

క. శరణాగతరక్షణఘన
బిరుదాంకుఁ డతండు వారిఁ బ్రేమం గనుచుం
గరుణించి తత్పురంబుల
నెఱయం దనబలము లుంచి నిండినవేడ్కన్. 8

వ. ఇవ్విధంబునఁ బ్రతిదినప్రవర్ధమాన శౌర్యధైర్యధురీణుండగు నమ్మహీమండలాఖండలుండు తొంటి రఘుమహారాజుచందంబున నిఖిలరాజులు

తనకు హస్తగతంబులు సేయ నాదవని ముదుగల్లు రాచూరు మొద
లైన మహాస్థలంబుల నిజబలంబు లుంచి గోలకొండపురంబుపైనుద్దండ
వేదండ కాండభటప్రకాండంబులతో నురువడించు నవసరంబున. 9

ఉ. ఆగజవాజిబృందముల కాభటకోటుల కాన్నృపాలుబా
హాగురుశౌర్యధైర్యముల కాత్మగలంగుచు విన్నమాత్రనా
హా గణుతింపశక్యమె యహర్నిశమున్ భయమందియుండిర
య్యాగరనాముదానగరియందు విజాపురి గోలకొండలోన్. 10

తే. లక్షగుఱ్ఱంబుతోడను లక్షణంబు
మెఱయ బీరాన మూఁడిండ్లతురకదొరలు
కృష్ణవేణికి నీవలఁ గృష్ణరాయ
నృపున కెదురుగ జనుదెంచి నిలిచి రపుడు. 11

చ. నిలిచినవార్త వేగరులు నిక్కముగాఁదనమ్రోలఁ దెల్పినన్
జెలఁగి భళీ తురుష్కతతిచెంతకుఁ జేరిన యంత వచ్చెనే
కలఁగి తొలంగి పోయెదరుగాక మదీయబలంబు ముంగలన్
నిలువఁగనేర్తురేయనుచునిశ్చలధైర్యమునన్వెలుంగుచున్. 12

తే. అపుడు కొలువయి కొలిచినయమరనాయ
కులను మన్నీల నందఱఁ బిలువ నంపి
సకలబహుమానము లొనర్చి జనవరేణ్యుఁ
డల్లఁ దురకల వృత్తాంత మెల్ల దెలుప. 13

మ. విని యాభూవరకోటిలోన ఘనదోర్వీర్యప్రభావుండు బం
ధునృపాలప్రబలుండుయుద్ధములయందున్స్వామికార్యంబునం
దు నయజ్ఞుండగు పెమ్మసానికులచంద్రుండైన యాధాయలిం
గనృపాలాగ్రణిబల్కె సంగరకలాకౌతుహలాయత్తుఁడై. 14

చ. తురక లనంగ నెంత పటుదోర్బలలీల వధింతు వారలన్
గుఱుతుపడం గుడార్లుదెగఁగోసెదబౌఁజులలో మెలంగెదన్
నరపతిచంద్ర యెంతయుఘనంబుగ దేవరవారిసొమ్ముది
న్నఋణము దీర్చుకోఁగలిగెనన్ గృపఁజూడు మటంచుఁబల్కినన్.15

తే. అపుడు సభలోనఁ గలిగిన యఖిలరాజ
సుతులు మన్నీలు మిగుల నద్భుతముగాఁగ
ఘనతరస్థైర్యశౌర్యము ల్గనపడంగఁ
బల్కి రెంతయు సంతోషభరితు లగుచు. 16

క. ఆనృపమణిపర్యంతము
రానిత్తుమె శౌర్యమహిమ రంజిల నిదిగో
పూని విరోధుల గెల్తు మ
నూనపరాక్రమధురీణ యుర్వీరమణా. 17

సీ. గుదులుగుదుల్ గాఁగ గ్రుచ్చియెత్తుదుముగా
పెల్లుగా వాలారుబల్లెములను
చేబల్మిచేఁ గ్రమ్మి చిమ్మివైతుము గదా
నోట దంటుకొనంగ నీటిమొనల
తెంపుతో గుంపులై తెగ నేయుదుము గదా
తఱుచైన శరపరంపరలచేత
జముదాడి యని తోచ జముదాడి పోటులం
గూలఁద్రోతుము గదా ఘోరలీల

వే. కరుల హరుల ధరాస్థలి దొరల దొరల
ముష్కర తురుష్కహరుల ధానుష్కవరుల
చెఱకుతుంటలరీతిని నఱకఁ గల్గె
కిరముల కరమ్ము గల్గుఖడ్గముల గముల 18

క. అని కొలిచిన వారందఱు
ననుపమశౌర్యములు మెఱయ నాడినమాటల్
విని యాభూమీరమణుఁడు
ఘనతరకౌతుహలంబు గడలుకొనంగన్. 19

తే. మీరలందఱు నటువంటిశూరవర్యు
లౌర కావున మాకు విచార మేమి
కార్య మొనరించి జయలక్ష్మిఁ గాంచుఁ డనుచు
వీడెము లొసంగె వేత్వేఱ వేడ్కమీఱ 20

తే. అటుల సమ్మానములు గాంచి యఖిలనృపులు
రణసముత్సాహములు మది రంజిలంగ
విభవ మలరంగ నవ్వేళ విశదలీల
శిబిరములు జేరి సుఖనిద్రఁ జెంది రంత. 21

క. ఆవృత్తాంతము చారుల
చే విశదముగాఁగ విని వజీరులు ముగురున్
భావంబుల నాలోచన
గావింపుచు భయము జెంది కళవళపడుచున్. 22

చ. కొలఁది యెఱుంగ కిట్లు మనగుఱ్ఱపుఁ బౌఁజులతోన కృష్ణ కే
వల నిటఁజొచ్చి రాఁదగదు వచ్చితి మెక్కడ బోవవచ్చు కే
వలనృపమాత్రుఁడే తలఁప వారిజ ¯భునియంశజుం డతం
డలిగిన నెంతవారలకునైన రణం బొనరింప శక్యమే. 23

తే. లక్షలకొలంది భటజను లక్షయప్ర
తాపధౌరేయు లానృపోత్తమునిఁ గొల్చి
యేకమనమున నున్నవా రెంచి చూడ
లక్షగుఱ్ఱంబు గాదె బలంబు మనకు. 24

చ. తురక లనంగ నెంత పటుదోర్బలలీల వధింతు వారలన్
గుఱుతుపడం గుడార్లుదెగఁగోసెదబోఁజులలో మెలంగెదన్
నరపతిచంద్ర యెంతయుఘనంబుగ దేవరవారిసొమ్ముది
న్నఋణము దీర్చుకోఁగలిగెనన్ గృపఁజూడు మటంచుఁబల్కినన్. 15

తే. అపుడు సభలోనఁ గలిగిన యఖిలరాజ
సుతులు మన్నీలు మిగుల నద్భుతముగాఁగ
ఘనతర స్థైర్యశౌర్యము లనపడంగఁ
బల్కి రెంతయు సంతోషభరితు లగుచు. 16

క. ఆనృపమణిపర్యంతము
రానిత్తుమె శౌర్యమహిమ రంజిల నిదిగో
పూని విరోధుల గెల్తు మ
నూనపరాక్రమధురీణ యుర్వీరమణా. 17

సీ. గుదులుగుదుల్ గాఁగ గ్రుచ్చియెత్తుదుముగా
పెల్లుగా వాలారుబల్లెములను
చేబల్మిచేఁ గ్రమ్మి చిమ్మివైతుము గదా
నోట దంటుకొనంగ నీటిమొనల
తెంపుతో గుంపులై తెగ నేయుదుము గదా
తఱుచైన శరపరంపరలచేత
జముదాడి యని తోచ జముదాడి పోటులం
గూలఁద్రోతుము గదా ఘోరలీల

వే. కరుల హరుల ధరాస్థలి దొరల దొరల
ముష్కర తురుష్కహరుల ధానుష్కవరుల
చెఱకుతుంటలరీతిని నఱకఁ గల్గె
కిరముల కరమ్ము గల్గుఖడ్గముల గముల 18

వ. ఇట్లు దార్కొని యొండొరుల మార్కొని తమతమ దొరల నామాంక నంబు లగుబిరుదులు బేర్కొని తొలుదొల్తయలబలంబు లెసంగయల గోలుబలంబులు తుపాకులపెళపెళలు పెట్లుగ్రోవులపెటపెటలు జబురు జంగుల ఫిరంగుల ఢిమఢిమలు ఢమాఢమీల ఢమఢమలు బాణావుఁజి వ్వాల జిఱజిఱలు బాణంబుల బిఱబిఱలు మనంబులం బుట్టు చిఱచిఱలు శింజినీటంకా రంబులు పరస్పరహుంకారంబులు నన్యోన్యపురస్కరణం బులు నితరేతరతిరస్కరణంబులు వివిధరోషణంబులు నెఱయ ఖడ్గా ఖడ్గి దండాదండి బాహాబాహిం దాఁకుచుం బెనంగుచుం బాయుచుఁ గ్రమ్ముచు డాయుచు నడచుచుం గ్రుమ్ముచుం జిమ్ముచు నెట్టుచుం దచ్చనల మెచ్చుచు హెచ్చుచుం జొచ్చుచునీఁటెలం గ్రుచ్చుచు బల్లెంబు లఁ గ్రుమ్ముచు కేడంబులం బమ్ముచు శిలల ఱువ్వుచు గెరలి నవ్వుచు తేజీల నడపుచు నేజాలం గెడపుచు లకోరీలందునుముచుఁ గొండొక సేపు రెండుబలంబులుం గన్నులపండువుగ చండశౌర్యంబులు వెలయ ఖండనం బొనర్చు నెడందడబడక కడువడిం గినుక వొడమి యొక్క మొగి రక్కసు లనందగిన వెక్కసపుమొక్కలపుతురుష్కలుధాను ష్కకౌశలం బడరం జనుదెంచరయంబు గన్గొని సంరంభంబునంబెమ్మ సానితామలింగనృపాలుండు కృష్ణరాయక్షమాకాంతున కిట్లనియె.

పంచచామరము

పరాకు రాకు రాకు మంచుఁ బారసీకభూపతుల్
చిరాకు మీఱ దట్టి మైనసింగిణీలకోరులన్
జిరాగుజాల వేసి డాసి చిల్లుపొల్లుజేయుచున్
నిరాకరించి మించి వచ్చు నేర్పుఁ జూచితే నృపా. 39

ఉ. పంతముతో హుటాహుటినిఁబొఁజులలోపలఁజొచ్చి సైన్యమిం
తింతలు గాఁగ ఖడ్గహతిఁ దెంచెద దేరిజ త్రాళ్ళు మీర లీ

చెంతనె యుండి కన్గొనుఁడు శీఘ్రముగాఁ బరవీరరాజులన్
దుంతవయాశికానిపురిఁ ద్రోచెదఁ జండపరాక్రమోన్నతిన్. 31

క. మీ రాసమయంబున జయ
భేరీరావములు చెలఁగఁ బృథుతరసైన్య
శ్రీ రాజిల దఱిమినచోఁ
జేరరె తమసీమలకును జెల్లాచెదరై. 32

ఉ. అనుచుంబల్లెము కేలఁబూనుకొని శౌర్యారూఢులౌకమ్మవా
ర్వెనువెంటం బదివేలు బల్లెములతో విఖ్యాతశౌర్యోన్నతిం
జనుదేరన్ ఘనసింహరావమలరన్ దత్సైన్యముంజొచ్చి హె
చ్చిన ధైర్యంబునఁ బారసీకతతులం జెండాడె నుద్దండుఁడై. 33

మ. మొనకు న్వచ్చినవిచ్చుకత్తులసివేము స్తీదుమేల్ రౌతులన్
దునుమాడంగనుగల్గిపార్శ్వములయందుంగ్రమ్మునశ్వమ్ములన్.
దనబల్లెమ్మున గ్రుమ్ముకమ్మఱుచు వెన్కన్ దారసిల్ జోదులన్
గని దూరంబుదొలంగఁజేయుఁబటుదోర్గర్వంబఖర్వంబుగన్

క. ఆదండధరుఁ డటంచున్
గోదండధరు ల్గలంగఁ గుటిలాసిమహా
వేదండతతులఁ గూల్చెన్
వేదండ నిజాప్తనృపులు వేడుకఁ జెందన్. 35

క. ఘనశరతతులం దనసా
ధనగతుల న్విసరి రిపులు తల్లడిలఁగ హ
త్తినరయమునఁ దఱుముచుఁగ
త్తినతఁడు దేరిజపుత్రాళ్ళ దెగఁగోసి వెసన్. 36

వ. అట్టహాసంబు జేయునతని బెట్టిదంపుదిట్టతనంబు నడుజిట్టాడుచు గుట్టు
చెడి యట్టట్టు మెదలం గూడకతట్టింబడినపులుఁగులగతి గొట్టుమిట్టాడి

పట్టపుదొరలు దెరలం జూచుసమయంబున రయంబున నవ్విధంబు గనుంగొని కృష్ణరాయ ధరానాయక హరిసాయకుండు చండశౌర్యంబున నుద్దంత వేదండసమారూఢుం డగుచునుభయచామరచ్ఛత్ర మరకత కేతనప్రభలు వెలయ నఖువదేను వేలగుఱ్ఱంబులు నాఖులక్ష లపదాతివర్గంబు నిన్నూఱుఘటంబు నేనుంగులుం గొలువ నొక్క నిబ్బరంబున సింహనాదంబులు రోదోంతరంబులు నిండం దఱుముచు జయభేరికాతాడనంబు గావించ నియోగించిన.

మ. జలధుల్ ఘూర్ణిలె దిక్కరుల్ బెదరెఁ జాంచల్యంబునొందెన్ ధరా
స్థలి ధాత్రీధరసంఘము ల్గదలె పాతాళంబు స్వర్లోకమున్
గలఁగెన్ శత్రుభయంకరప్రకటదోర్గర్వస్ఫురత్కృష్ణరా
యలనద్భేరిధణంధణస్వనము లాశాంతంబులం బర్వఁగన్. 38

తే. అటుల జయభేరికారవం బతిశయించఁ
జెలఁగి చనుదెంచునతనికో ట్లలకుఁ గాఁగఁ
జెదరి బెదరి కలంగి కన్ జెదరి తొలఁగి
గచ్చువిచ్చయ్యెఁ బారశీకవ్రజంబు. 39

వ అయ్యవసరంబున 40

ఉ వాహినిఁ గూర్చి నీవు శరపాళి విరోధుల ముంచితౌ నృపా
వాహినులందు నెన్నఁ దగువాహినిగానె భవత్సహాయ నై
యూహరఁలన్ శరార్తినలయించెదఁ జూడుమటంచు నెంచెనో
నాహదిసీలనీలసలిలావృతిఁ గృష్ణయు నిండె నెంతయున్. 41

క. కొందలము మిగుల మదిలో
నాందోళన మంది తురక లకట ఖుదా నే
మందము సీమలకుం జను
టందముఁ గా కిచట నిల్వనగునే మనకున్. 42

ఆ. ఎందుఁ జనఁగ రానియిక్కట్టు ప్రాపించెఁ
గృష్ణ రాఁ దొడంగెఁ గృష్ణరాయ
లివలఁ దెఱుమఁ జొచ్చె నెంతయు వెఱపించఁ
బోయి వెఱచుకొన్నచాయ యయ్యె. 43

ఆ. పదరి కృష్ణ దాఁటి పదపద మని వచ్చి
యొక్క మన్నె వాని కోర్వలేక
తిరిగినట్టు లయ్యెఁ దెలియంగ రాయల
యెదుటఁ బడినరిపులు బ్రదుకఁ గలరె. 44

తే. వెనుక ముందైనయంతనే వెనుకముందు
చోఁచకున్నది నది దాఁటి తొలఁగు టరిది
యనుచు మంత్రులు దాము నన్యోన్యచింత
నాత్మలోఁ గుంది కద లేనియార్తిఁ జెంది. 45

సీ తురకవేషము మాని తోర మౌ కర్ణాట
కపు వేషములు వేసి కదలువారు
దండిదరికివచ్చెఁ జెండె నీత.డు మించి
పొండి యనుచుఁ బాఱిపోవువారు
వేగుజూచెద మంచు వెగవెగఁ జనుదెంచి
దూర మేఁగుచు బొదల్ దూఱువారు
వెనువెంటఁ దగిలెను వీఁడె వీఁడె యటంచు
గొబ్బునఁ బఱచుచుఁ గూలువారు

తే. సారెసారెకుఁ గర్తాలు దూఱువారు
నై కలంగి యథాయథ లగుచుఁ జనిరి
మదహయగజంబు లటుబెట్టి మొదటిదొరలు
ఒక్కవిధమున నది దాఁటి యుఱికి రపుడు. 46

తే. అటుల జయలక్ష్మిఁ గైకొని హరులకరులఁ
బరులధనపంక్తులను దనవశము జేసి
వెలయు శ్రీకృష్ణరాయల విభవగరిమఁ
గాంచి కన్నుల పండువుగాఁగ నపుడు 47

తే. సరససాహిత్యరచనవిస్ఫురణ మెనయ
సారమధురోక్తి మాదయగారిమల్ల
నార్యుఁ దలయల్లసాని పెద్దార్యవరుఁడు
ముక్కుతిమ్మన మొదలైనముఖ్యకవులు. 49

క. వినుతించి రపుడు వారికిఁ
గనకాంబరభూషణములు ఘనత నొసఁగి యా
జనవరుఁ డప్పాజిఁ గనుం
గొని యిట్లని పలికె నపుడు కుతుకం బలరన్. 49

చ. విరిగినవైరులం దటిమి వేగమె వారలసీమ లెల్ల సు
స్థిరమతి నాక్రమింపవలదే యను డానెఱమంత్రి బల్కెభూ
వర యిది వేళగాదు పౌరవం జననిచ్చి కెలంకులందు స
త్వరు లగుశాత్రవుల్ గదియవైపుదొరంగదెయెంతవారికిన్. 50

తే. భూమిపాలక గజపతి సీమలోన
గలుగువారల మించి మార్గములయందు
నెందు ముట్టడి గావించ నెంచ మనకు
రస్తుసామగ్రి జేరుట దుస్తరంబు

క. తూరుపునం గలగజపతి
వారిదళమునెల్లఁ దెచ్చి వరుసన్ జయల
క్ష్మీరమణిఁ జెందు మనవుడు
భేరీభాంకార మడరఁ బృతనాయుతుఁ డై.

తే. తనప్రతాపప్రకాశంబు దనర బంధు
జనమనఃపద్మనికరరంజన మెలర్ప
నహితకువలయవరగర్వ మణఁగ నుదయ
గిరికి వేవేగ నయ్యనుం డరుగుదెంచె. 54

క. వచ్చి చతురంగబలములు
విచ్చలవిడి నాల్గుదిశల వెలయఁగ నిలిచెన్
మె చ్చలరఁగ దనమహిమ వి
యచ్చరు లచ్చెరువుతోడ నభినుతిసేయన్. 54

సీ. ఏచాయఁ గనుఁగొన్న హేరాళ మై త్రోఁచు
గంధాంధసింహళగజచయంబు
నేవంక నీక్షించ హేషారవోదీర్ణ
గాంధారకాంభోజకాండవితతి
యేదారిఁ జూచిన నాదారిన తుపాకి
బలువైన జబురుజంగులు ఫిరంగు
లేదండ గణుతించ వేదండకరచండ
కోదండధరభటకోటి పటలి

తే. యెచటఁ జూచిన బల్లెంబు లీఁటెగములు
గలుగు రాయలదళ మెల్లఁ గలయ నెంచి
యుదయగిరిచెంత నుదయించె నొక్కవింత
యనుచు దుర్గములో మంది యళుకుఁ జెంది. 55

క. అభిమానమునకుఁ గా న
య్యిభరాజుజనంబు బోరె నెంతయు బాహా
విభవం బెలర్ప సేనా
రభసమ్మున కెదిరి కృష్ణరాయలతోడన్. 56

క. దుర్గమ మగునాదుర్గమ
నర్గళగతి దీయుటకు నహర్నిశము మహా
దోర్గర్వమునన్ నానా
మార్గములం బోరి రపుడు మాద్యద్గతులన్. 57

సీ. కోటలు దుర్గమున్ గొనుచు దోఃపటుబల
ధాటిచే మించునార్వీటివారు
కంటకాహితకంఠలుంఠనోద్ధతలీల
దంట లై తగుతొరగంటివారు
నిబ్బరంబుగ శత్రునికరంబు నణఁగించి
ధీరు లై మించుగొబ్బూరివారు
చాల దోర్బలలీల సమదారిసంఘంబుఁ
దూలించి వెలయునందేలవారు

తే. నాదిగాఁ గల్గురాజులు మేదురగతి
తుళువదొరలును బోయలు దురుసు గాఁగఁ
బ్రతిదినంబును ఘోర పౌరణ మొనర్ప
నిలిచి పోరాడె గజపతిబలము లపుడు 58

ఉ. తీవిగ నొకువారును కడింది రహిన్ వెలుగోటివార లా
రావెలవారు గూడుకొని రాత్రి బగల్ చతురంగసేనతో
నేవగఁ జూచినన్ దెలియ నెంతయుశక్యము గానిదుర్గమా
భూవరమౌళి గాంచి యొకపూఁటనెదీసెద నంచు న్యగ్రుఁడై. 59

ఉ. దిగ్గున లేచి సాహసము తేటపడన్ మునుమున్న గాఁగఁదా
నగ్గలికన్ జెలంగువిధ మంతయుఁ గన్గొని గోషచత్తుఁ డై
లగ్గల కెక్కి రందఱు బలంబు చలం బలరన్ రవంబు న్
దిగ్గజముల్ వడంక బలుతెంపున గుంపులుగూడి యుద్ధతిన్. 60

క. తనధాటి కళుకుచున్ గ్ర
క్కున నదుర్గము డిగ్గి కావుకా వనువారిన్
గనుఁగొని యాభూరమణుఁడు
ఘనతరకారుణ్యరసము గడలుకొనంగన్. 61

తే. జడియకుఁ డటంచు నభయహస్తం బొసంగి
యమ్మహాదుర్గమహిపుకు నద్భుతంబు
నొంది యచ్చట నాప్తుల నుంచి యవల
జనియె నుద్దండశౌర్యప్రచండుఁ డగుచు 62

సీ. ఆట కంమకూరు బెట్టదిరె కాహళశంఖ
భేరీవిరావముల్ భోరుకలగ
ఆవల కొండవీ డలరె దిక్తటనట
త్సేనారజో వజశ్రీలు వెలయ
మఱికొండపలిఁ గలంగె రటన్మ దేభేంద్రు
ఘంటి కాఘణఘణంఘణలు జెలఁగ
ఆమీఁద వినుకొండ యల్లాడె భటసము
ద్భటసింహరవమహాశ్భటులు దనర

తే. వెండియును గల్గుకోటలు వివిధదుర్గ
తతులు తముఁ దామె విడిచి కొండలకుఁ జేరి
రచటిగజపతివారిసైన్యాధినాడు
లలనృపాలునిదాడికి నిలువలేక. 63

తే. ఎదురు గాంచనముద్రలు ముద మెలర్ప
దెచ్చి వేవేగఁ జేతి కందిచ్చువారు
శరణు వేఁడుచు సాష్టాంగ మెఱఁగువారు
నైరి యుత్తరమునఁ గల్గునట్టిదొరలు. 64

వ. ఇవ్విధంబున నిఖిలస్థలదుర్గశైలదుర్గంబులు హస్తగతంబులగుటయు నందందుఁగ్రందుగ నిజసైన్యంబు లుండ నియమించిన దర్పంబున నమదానగరంబుపయి గరంబు దురంబు సేయందలంచి యప్పురంబునలుదెసలుంజుట్టుముట్టినం బెట్టదరియు బెదరియుఁ దజ్జానపద వర్గంబు పలుదెసలం బాఱ మీఱినరాగంబున నచ్చటియవనబలంబు లెసంగ చలంబునన్ గోట వెడలి వడిం బోరు ఘోరం బై కౌరవపాండవరణంబునుంబోలి గాంగేయ కుంభజాతదుశ్శాసన వీరలక్ష్మణ కర్ణ శల్య హరణకారణం బై రామరాక్షస యుద్ధంబునుం బోలి ఖరదూషణ బలకబంధసంబంధ హరివర ప్రహరణధురీణం బై కృష్ణదానవసంగ్రామంబునుం బోలి మాగధ బలి దంతవక్త్రకేశి శిరఃఖండనప్రచండం బై భంగంబు లగుమతంగజంబులు పాటితంబు లగుఖేటకంబులు పాతనంబు లగుకేతనంబులు తొఱఁగుగాత్రంబులు విఱుగుఛత్రంబులుసస్తంబు లగుచామరంబులు నస్తంబులగు తోమరంబులు పాటితంబులగుకపాలంబులు నిరంతరంబుగ మెఱయు నయ్యుద్ధ విడికి నోహటించి చలించిపలాయమానులగుపారసీకుల ననేకులం గాందిశీకులని యెంచి బ్రతుకుచురుగాకయని యుపేక్షించి తదీయస్థలంబున జయధ్వజం బెత్తించి పదిలంబుగ దళంబు హత్తించి జయోత్సాహంబున మించి గజపతి యున్నదేశంబుకుం గమకంబునం దమకంబు మీఱంజననెంచు నమ్మూరురాయరగండప్రచండ బిరుదాంకుం గనుంగొని యనంగునిమామగురునిం గ్రేణిసేయం గల సుధీచమత్కారంబున వెలయు సాళ్వతిమ్మరుసు మంత్రిపుంగవుం డిట్లనియె. 65

చ. ఇతరులు శక్తులే తలఁప నేమలశాహునిజాముశాహులన్
గుతపనిమల్కునున్ గెలిచి గొబ్బున సర్వగిరీంద్రదుర్గముల్
జతురతఁ గైకొనన్ ధర నసాధ్యము నీ కిఁక గల్గ దైన నం
చితయశ యొక్కవిన్నపముఁజేసెద వేడుకఁ జిత్తగింపుమా. 66

ఉ. తిన్నఁదనంబునన్ గజపతిం గెలువం జను టొప్పు గాక యా
పన్నశరణ్యశైలవనపంక్తులు దాఁటి తదీయసీమలో
న న్నిలఁ జూచి వారలు ఘనంబుగ మార్గము లడ్డగించినన్
సన్నుతశౌర్యరస్తు మనసైన్యము జేయుట దుస్తరంబగున్. 67

చ. అనుటయుఁబిన్ననవ్వునగియప్పుయిదెంతటికార్యమయ్యయా
వనగిరు లెంత వస్తుతతి వచ్చుట యెంత సమస్తదేశముల్
మనకువశంబులయ్యెఁ బదమా ముదమానుచుసంశయంబునె
మ్మనమునమానుచున్దివిజమంత్రిసమానయటంచుఁబల్కుచున్. 68

క. ఆవీరనృసింహాధరి
త్రీవరనందనుఁడు రణదతిస్ఫుటభేరీ
రావములు చెలఁగ నడచెన్
దేవతలు నుతింప గజపతిన్ గెలుచుటకై. 69

క. చనుచోఁ జితాపుఖానుం
డనువాఁడు ధరాధరాంతరాంతరసీమన్
గనుమలలో నఱువడివేల్
ఘనశార్ఙ్గధరుల్ చెలంగఁ గలహ మొనర్పన్ 70

ఉ. నాలుగుదిక్కులం గవిసి నట్టడవిం జరియించు నచ్చమూ
పాళి గలంగ బల్లెముల బాణములన్ మెఱుగీఁటెగుంపులన్
రాలఁ దుపాకులం బలుఫిరంగుల భంగము నొందఁజేసి గ
గ్గోలుపడం గడంగి యెలగోలుబలంబు చలం బెలర్పఁగన్. 71

క. ముంగల నెసంగ రంగ
త్తుంగతురంగేంద్రఖురవిధూతరజంబుల్
నింగిఁ జెలంగఁ గళింగధ
రాంగణమున నిల్చె రాయ లద్భుతమతి యై. 72

పంచచామరము

చితాపుఖానుఁ డంగడిందిచిచ్చు నార్చ నేర్చె వ
చ్చితింగదా ముదంబు మీఱ శీఘ్ర మీగజాధిపున్
నితాంతకీర్తి ధాత్రిలోన నిండ గెల్చెదన్ ఘన
ప్రతాపదీధితిం దిగంతభాగము ల్విరాజిలన్. 73

తే. అనుచు పొట్నూరిసింహాద్రి కరుగుదెంచి
సకలచతురంగబలములు సరగ నపుడు
పరభయంకరవైభవప్రకటలీల
పాళె మిడియించె వేడ్కఁ నప్పార్థివుండు 74

సీ కెందమ్మిచెంగల్వచందమ్ములం గెల్వఁ
జెల్వైనకెంబట్టుజిగి గుడార్లు
రంగారుబంగారుసింగారము లెసంగు
మేలైనవెలిపట్టుమిహిగుడార్లు
ఓగురాకుతెగసౌరు నగ రాజిలు హుశారు
వగ మీఱు రత్నాలవహిగుడార్లు
హెచ్చైనపిలువ మేల్పచ్చడాల్పచ్చడాల్
పచ్చడాల్ గలజీనిపనిగుడార్లు

తే గొప్పహురుమంజిసుప్పాణికూర్పుడంపు
డంబు పగడంబు జగడంబు స..బరంబు
లెసఁగినగుడార్లు గలుగునవ్వసుమతీశు
పాళె మీక్షించి గజరాజు భయము మించి. 75

శా పౌరా చూచితెగాని రాయలబలం బౌరౌర యేనుంగు ల
య్యారే చారుతురంగసంఘములుహోహో మన్నెవాకల్ భళీ

ధీరుల్ రాజకుమారులంచు మదినెంతేయద్భుతంబొందుచున్
బోరన్ శక్యమె యీనృపాలమణితో భూరిస్థిరప్రౌఢిమన్. 76

తే. అనుచు నాప్తులతోన మంతన మొనర్ప
వార లిట్లని పలికిరి వసుమతీశ
యలపదార్గురు పాత్రులు నద్భుతప్ర
తాపశాలులు గలుగంగఁ దలఁక నేల. 77

క. అనుటయుఁ దెలివిం జెందుచు
జననాథుఁడు వారివారి సదనంబులకున్
ఘనులయినమంత్రిపుంగవు
లను బంపెన్ వారువారలం బిలుచుటయున్. 78

క. చనుదెంచువార లవ్విభుఁ
గనుఁగొనఁ గూర్చుండుఁ డనుచు గౌరవ మెసఁగన్
ఘనతరముగ బహుమానము
లొనరింపుచుఁ బల్కె నప్పు డుచితప్రౌఢిన్. 79

ఉ. వింటిరె కృష్ణరాయపృథివీపతి యచ్చట శౌర్యలీలచేఁ
గంటకు లౌతురుష్కులఁ గకావికలై చనఁజేసె నెంతయున్
దంటతనంబు మీఱ భుజదర్పమునన్ మనసీమఁ జొచ్చెగా
కంటికినింక సేయఁదగుకార్యము లెయ్యవి తెల్పుఁడియ్యెడన్. 80

క. మును పెదగజపతిభూవరుఁ
డనువందన్ సేతుదర్శనార్థం బరుగన్
వెనువెంటఁ జనినతురకలు
వినుఁ డాదేశమునఁ గొన్నివింత లొనర్పన్. 81

క. అది చాల న్మనసునఁ గల
దదియును గా కిచటిసీమ లస్మత్స్వమల్

గలిసినమాట ల్వినుఁ డ
కుప్పలరత్నము సూడుద్రిప్పుకొన వచ్చె సుమీ. 82

ఆ. కృష్ణరాయఁ డనఁగఁ గేవలమనుజుఁడే
విష్ణుమూర్తి గాన విజయశీలుఁ
డతని గెల్వఁ దగినయతులితోపాయంబుఁ
జింత సేయుఁ డయ్య శీఘ్రముగను. 83

క. అనిన విని కృష్ణరాయం
డననేమి సురాధినాథుఁ డైనన్ భయమే
యనియెన్ బలభద్రనిభుం
డనఁదగుబలభద్రపాత్రుఁ డతిమోదమునన్ 84

శా. భర్గుండిట్లుదెంచెనో యని రిపుల్ భావింగ జన్యస్థలిన్
దుర్గాంబాకరుణాకటాక్షవిలసద్దుర్వారఖడ్గాహతిన్
దోర్గర్వం బలరంగ నీక్షణమె గెల్తుం జూడు మంచు న్వేసన్
దుర్గాపాత్రుఁడుబల్కెఁ భూవరుఁడుసంతోషంబునన్ దేఁగన్. 85

క. భీముఁ డని రిపులు దలఁపఁగ
భీమాహవ కేళి సల్పి పేర్చెద వినుమీ
భీమకటాక్షముచేతఁ గృ
పామహిమభీనటంచు భీమపాత్రుం డనియెన్. 86

## పంచచామరము

ముకుందసత్కృపాకటాక్షము న్విరాజిలన్ నృపా
ముకుందబల్లెముం గరంబు బూని శత్రుసైన్యమున్
చెకుందముం జెలంగ జొచ్చి చింతు వింతగా ననెన్
ముకుందపాత్రుఁ డెంతయుం బ్రమోదయుక్తచిత్తుఁడై. 87

క. వీకరణిం జననీయక
వే కరఖడ్గమున శత్రువీరులనెల్లన్
శ్రీకరముగ గెలిచెద నని
భీకరపాత్రుండు బల్కె భీకరలీలన్ 88

తే. శూరవరు లన్న యారాయబారు జొచ్చి
ధీరుఁ డని మెచ్చ ఖడ్గసందీప్తు లెసఁగ
నాహవ మొనర్తు నని పల్కె నద్భుతముగఁ
జేరుపాత్రుండు సారగంభీరఫణితి. 89

క. క్షణమున జయించి వచ్చెదఁ
బ్రణుతింపఁగ శత్రువరుల బలిమి నటంచున్
రణరంగపాత్రుఁ డనియెన్
రణరంగోత్సాహవిభవరంజితమతి యై 90

క. సుత్రామాదులు మెచ్చన్
శాత్రవులఁ గెలిచి వత్తు సరగున ననుచుఁ
జిత్రముగఁ బలికె ఖడ్గా
పాత్రుఁడు సభవార లెల్లఁ బ్రణుతి యొనర్పఁ 91

క. తుండములతోడ మదవే
దండములం గాండతతుల ధరణిం బడగా
ఖండాజెండెద నని యా
ఖండలపాత్రుండు బలికెఁ గడువేడుకతోన్. 92

చ. బలముచలంబు నేర్పడ శభా సని దేవరవారు మెచ్చఁగా
విలసితబాణపాతముల వేగమె శత్రునృపాలసంఘముల్
కలఁగి తొలంగ నేతు నని గౌరవరీతి దగఁ మురారిపా
త్రులు బలికెన్ గజాధిపతితోఁ దనశౌర్య విలాస మేర్పడన్ 93

వ. వెండియుఁ బ్రచండశౌర్యుం డగువజ్రముష్టి పాత్రుండును తురగరేవంతపాత్రుండును గజాంకుశపాత్రుండును అసహాయపాత్రుండును మృగేంద్రపాత్రుండును దక్షిణవీరలోకంబు నట్లనె పలికినం గనుంగొని వారలతో నిట్లనియె. 94

ఆ. ఇట్టిపట్లు మీర లెవ్విధంబున నైన
నిర్వహింప వలయు నిఖిలరాజ్య
వైభవం బటంచు వక్కలాకులతోడ
వస్త్రభూషణములు వరుస నొసఁగ. 95

క. అన్నిటికి జగన్నాయకు
లున్నా రని పలికి రణసముత్సాహమనో
త్యున్నతిఁ జని రని వారల
సన్నాహము కృష్ణరాయజనపతి వినుచున్ 96

తే. ఇలఁ బదార్గురు రాజుల చెలువు గలిగి
యలచతుర్దశభువనముల్ గెలువఁ బూను
నట్టిఘను లౌనెకా వారినణఁచ వశమె
పదరి వచ్చితి మప్పాజిపలుకు వినక. 97

క. అని యాలోచనఁ జేయుచు
మనమున నారాత్రి యుబ్బుమఱుగునఁ బాళెం
బునఁ గలజను లవ్వార్తలు
విని యుత్సాహంబు లేనివిధ మెఱిఁగి వెసన్. 98

ఆ. అయ్యదంత మప్పు డప్పాజితోఁ దెల్ప
నాదుపల్కు వినక నరవరేణ్య
వచ్చినంత యింత వచ్చెఁగదా యిందు
కేమి సేయువార మిచటఁ జెపుమ. 99

తే. అనుడు రాయలుబల్కె నీ వనినమాట
లెక్కసేయమి నిచ్చోటఁ జిక్కవలసెఁ
దలఁప నినువంటిమంత్రి యిద్ధాత్రిఁ గలఁడె
చూడు మిందుల కొకయుక్తి సూక్ష్మమతిని. 100

మ. అను దమ్మంత్రిరేణ్యుఁ డిట్లనియె నయ్యా భేదమార్గంబునన్
వినుమప్పాత్రులఁగెల్వగావలయు నుర్వీశౌర్యధైర్యంబు
లం, జెనయన్ శక్యముగాదు గా ధనమణిశ్రేణీదుకూలాదివ
స్తునికాయంబులొసంగనెవ్వరునసాధ్యుల్ లేరుచింతింపఁగన్.

క. నావుఁడు బొక్కసమంతయు
నీవశ మగు నీకుఁ దోచునియతిం గార్యం
బేవగను నిర్వహించెదొ
ధీవర్య యటంచు నరిగె తేజం బెసఁగన్. 102

వ. ఇట్లరిగి యభ్యంతరమందిరంబున సుఖంబున వసించె నంత నమ్మంత్రి
పుంగవుండు. 103

క. ఘనతరభేదోపాయం
బునకుం దగినట్టియుక్తిఁ బుట్టించి రయం
బొనరఁగ రాయలపేరిటి
దినసరు లాక్షత్త్రియులకుఁ దేటపడంగన్. 104

క. వ్రాయించి మందసమ్ముల
రాయల్ ధరియించునాభరణవస్త్రతతుల్
ధీయుక్తి నుంచి పంపె శు
భాయత్తత భటులఁ గూర్చి యప్పాత్రులకున్. 105

క. పంచిన దుర్గములోపలి
వంచనఁ గని సామజేంద్ర వారలు వారిన్

బొంచి దొరమ్రోల నిల్చిన
సంచలితస్వాంతుఁ డగుచు సరగున నతఁడున్. 106

తే. దట్టముగఁ బెట్టియలలోనఁ బెట్టి యున్న
తళుకుబంగారుజిగికాగితములలోని
సారముగ వ్రాసి యున్నదస్తూరిఁ జూచి
చదువుకొనె నాత్మలోన విస్మయము గదుర. 107

సీ. శ్రీమతు కర్ణాటసింహాసనాధ్యక్షుఁ
డగుకృష్ణరాయధరాధినాథుఁ
డల పదారుగురు పాత్రులకు సంప్రీతిఁ బం
పినసులేఖంబులు మిమ్ము మును పు
గజపతిరాష్ట్రదుర్గవిశేషములనుండి
మెలఁపుగాఁ బలికినపలుకుబడుల
తీరు వ్రాసితిరి మీకోరినట్లనె ఘనా
భరణదుకూలముల్ బంపినార

తే మట్లనే రేపు జగడాని కరుగుదెంచి
నట్లు జనుదెంచి మాచేతి కతని మీరు
పట్టియిచ్చిన యపుడె మీపట్ల మేము
కొదువ పడకుండ నడపించుకొనెద మెపుడు. 108

ఆ. అనుచు తేటపడినయావ్రాఁతఁ గనుఁగొని
వ్రాఁత యిట్టులయ్యె వసుధలోన
నమ్మఁ గూడ దెంతనమ్మినవారల
మోస మయ్యె ననుచు వేసరిలుచు. 109

క నరసేంద్రుకృష్ణరాయల
వరధాటికి నిల్వలేక వారణపతి స

త్వరగతి తత్పురమతి న
ప్పుర మతిదూరముగ వెడలి పోయెన్ బెలుచన్. 110

క. మరునాఁ డాకథ విని తా
మరిగిరి సంతోషరహితు లై యెందైనన్
దారి లేనిపోటు గలదే
దురమున నని తలఁచి యచటఁ దొలఁగుచుఁబాత్రుల్. 111

తే. అపుడు త్రైలోక్యసామ్రాజ్య మబ్బినట్లు
సకలచతురంగసేనతో సంతసిలుచు
గృష్ణరాయక్షితీంద్రుండు కీర్తి వెలయ
సరగ నచ్చట నొకజయ స్తంభ మునిచె. 112

తే. తత్పురంబుఁ బ్రవేశించి తగినరీతి
నల్లగజరాజనగరిచాయలకుఁ దనదు
సేన జనకుండ దిట్టంబు జేసి తాను
నొక్కచోట వసించెను యుక్తలీల. 113

వ. తదనంతరవృత్తాంతం బెట్టిదనినఁ 114

చ. మునిసవనావనా భువనమోహనదానకళాజితాబ్ధిరా
డనిమిష ధేనురత్న తరుహాటకశైలఘనాఘనా పురా
తనబహువాక్యవర్ణితపదద్వయసద్వయదుఃఖభంజనా
యనుపమభక్తివైభవపదాంబుజసేవక చిత్తరంజనా. 115

క. వనసంచారిగణప్రభు
ఘనతరసామ్రాజ్యవిభవకారణకరుణా
వనరాశిగర్వహరణా
కనకాచలధైర్య జనకకన్యారమణా. 116

వనమయూరము

సూనృతవచోవిభవ సూరకులచంద్రా
దీనజనరక్షక సుధీజితఫణీంద్రా
భూనుతవిలాస ఘనపుణ్యగుణవాసా
హీనజనదూర విబుధేంద్రజనిరాసా. 117

గద్యము. ఇది శ్రీమదోరుగంటి కాశీపతిసద్గురురాజయోగీంద్ర చరణారవింద మనోవిహార నిరంతరానందకర రాజయోగ సామ్రాజ్యలక్ష్మీధురంధర స్వస్వరూపానుభవసంపన్నజ్ఞానప్రసూనాంబికా కాళహస్తీశ్వరకరుణా కటాక్షవీక్షణప్రసాదాసాదితకవితాచమత్కార ధూర్జటిపౌత్ర కాళయామాత్య లక్ష్మ్యంబికాదత్త పోలనమంత్రిగుర్వమాంబికా కుమార ధూర్జటిప్రణీతం బైన శ్రీకృష్ణరాయవిజయం బనుమహాప్రబంధంబు నందుఁ దృతీయాశ్వాసము.



శ్రీ ర స్తు

# కృ ష్ణ రా య వి జ య ము

## చతుర్థాశ్వాసము

శ్రీ మదనంతపరాక్రమ
ధామా యార్వీటిరామ ధరణీశసుత
శ్రీమద్వేంకటరాయ
ప్రేమాస్పద రామచంద్ర పృథుగుణసాంద్రా. 1

వ. అవధరింపుము. 2

శా. ఆరీతిన్ జయలక్ష్మి గైకొని మహాహ్లాదంబుతో నవ్విభుం
డారూఢిన్ దనపద్దు చెల్లె నిట రాజ్యం బాగజాధీశ్వరుం
డే రంజిల్లుచు నేలుఁగాక యనియెంతే వేడ్కఁ దన్మంత్రివే
నారాజుం బిలిపించె నంచితకృపావ్యాపారపారీణుఁ డై 3

తే. అందులకుఁ గొంత సంశయ మంది యతఁడు
రాయ లెంతయు బాంధవప్రౌఢి వెలయఁ
దలఁచి యుండుట లెస్సగాఁ దెలిసి యపుడు
కానుకలు గొంచుఁ జనుదెంచె ఘనత దనర. 4

సీ. భువి రోహణాచలంబునకు రత్నావళు
లంచితంబుగ సమర్పించినట్లు
రహిని మేరుధ రాధరంబున కెంతయు
రంగారుబంగా రొసంగినట్లు

తగ సుధాసాగరోత్తమున కెవ్వారైన
మెచ్చనాక్షీరము దెచ్చినట్లు
సరగ మందారభూజమునకు వింతగా
హెచ్చైనయొకఫలం బిచ్చినట్లు

తే. నమ్మహాగుణమణికి నయ్యతులధైర్య
హారికాకరుణానిధి కావితీర్ణ
ఖనికి మణిధనదేనువుల్ ఘనపటములు
వసుతతియు మ్రోల నిడె గజవల్లభుడు. 5

తే. కరము గమ్గొని మిగుల శ్రీకరము గాఁగ
కరము వేడుక నెదు రేఁగి గౌరవముగఁ
గౌఁగలింపుచు నెనరున గారవించి
రాయ లెంతయు నాగజరాజు నపుడు. 6

క. కూర్చుండుఁ డనుచుఁ దానుం
గూర్చుండినయపుడె నెనరుగూర్చినమదితో
నేర్చిననవరత్నంబులు
జేర్చినసింహాసనమున సింధురపతియున్. 7

క. వసియించి కృష్ణరాయల
రసికతకు న్మనసులోన రంజిలి విలస
ద్బిసవుహమరందధారా
విస్ఫురమధురోక్తిగరిమ వెలయఁగ ననియెన్. 8

క. నిరసించిన నిరసించన్
శరణన రక్షించ నీకె చను నృపతులతోఁ
గరుణించితి వీపట్లన్
దిరముగ సింహాసనంబు నిల్పితివిగదా. 9

క. లోకంబు లెల్ల మెచ్చఁగ
మాకుం బ్రాపగుచు నిట్లు మన్నించితి వౌ
శ్రీకృష్ణుఁడు ధర్మసుతం
జేకొని రక్షించినట్లు సిద్ధముగాఁగన్. 10

క గోవిప్రుల రక్షింపుచు
దేవగృహతటాకములఁ బ్రతిష్ఠించి ధరన్
భూవర యపహృతరాజ్య
శ్రీ వెలయించినయతండె శ్రీవిభుఁ డెందున్. 11

ఉ. నీరుణ మెందుఁ దీర్చుకొన నేర మదీయకుమారిఁ జారుశృం
గారమణిన్ గుణోన్మణిని గైకొను మిచ్చితి నీకుఁ గీరతు
ఖ్కారసమానరూప హిమకైరవబంధుయశఃకలాప ల
క్ష్మీరమణాప్రతాపనరసింహకుమార కుమారవిక్రమా. 12

తే. నావు దప్పాజి యాగజనాథుతోడ
ననియె నీతోడ బాంధవం బరయఁ గృష్ణ
రాయశౌరికి క్షీరనీరధి మురారి
కబ్జగేహిని నొసఁగిన యట్లసుమ్మి 13

చ. అనవుడుఁ గృష్ణరాయనృపుఁడాగజనాథునితోడ నిట్లనెన్
వినుము నరేంద్ర నీ వసఁగ నే నన భేదము లేదు నీమనం
బుననొకవింతగాఁదలఁపఁబోకుముశీఘ్రముగాఁగ నెంతయున్
ఘనతరవైభవం బలరఁగా నొనరింపు వివాహయత్నమున్. 14

క. అనుటయుఁ బరమానందం
బున గజపతి కృష్ణరాయభూపాలునితో
జననాథ మత్కుమారిం
గనుఁగొన నప్పాజిఁ బంపఁ గాఁదగు వేడ్కన్. 15

తే. మత్కుమారివివేకసంపద తదీయ
రూపరేఖావిలాసనిరూఢి జూచి
వేగ నిటు వచ్చు పంపు నావెంట నిపుడు
నవ్యగుణసంగ శుభలక్షణం బెసంగ. 16

తే. నావుఁడును గృష్ణరాయధరావిభుండు
తనదునెమ్మోము గనుఁగొన్నమన నెఱింగి
యమ్మహామంత్రి స్వామి భాగ్యంబుఁ జేసి
నాడ చూచెద ననుచు సంతస మెలర్ప. 17

తే. అపుడు బహుమాన మొనరించి యధిపుఁ డంప
విభవ మలరంగ నగ్గజవిభునివెంట
నరిగి యమ్మంత్రిమౌళి తదాదరంబు
దనరఁ గక్ష్యాంతరంబులు దాఁటి యెలమి. 18

క. నవరత్ననిర్మితోన్నత
భవనంబున రత్నపీఠిపై వసియింపన్
సవినయముగ నజ్జనపతి
వివిధాంబరభూషణములు వేడుక నొసఁగెన్. 19

క. నీయంతమంత్రిమణి సుర
నాయకునకు నైనఁ గలఁడె నరనుత మాకున్.
రాయలబంధుత్వంబును
నీయుక్తిం గలిగెఁ గాదె నీతివిచారా. 20

క. అని సరసగోష్ఠిఁ బెంపొం
దినవేడ్కఁ గుమారిఁ దోడి తేఁ దగువారిన్
బనిచిన ఘనశృంగారం
బొనరం దొడితెచ్చి రప్పు డుచితప్రౌఢిన్. 21

సీ. తళుకుకన్గవ జిల్కుఁదళుక్కుఁజూపులసౌరు
తమ్మిరేకులతీరుఁగ్రమ్మరింప
మెఱుఁగుటద్దపుముద్దుమెఱయునిద్దపుమోము
మొలకనవ్వులతేట గులకరింపఁ
గప్పురాజిగి నొప్పుకఱకు పెన్నెరిగొప్పు
తేఁటిదాఁటులనీటు దీ టెసంగఁ
గమ్మపూనెరిమేనియెమ్మెమేలికడాని
గ్రొమ్మెఱుంగుహొరంగుఁ గ్రుమ్మరింపఁ
తే. గులుకువగగుబ్బచనుదోయి గునిసి గునిసి
సరిగెచెంగావిపైఁటతో సరసమాడ
చరణమంజీరరావము ల్సందడింప
వచ్చెఁ జెలువంబు మీఱ భూవరకుమారి. 22

తే. వచ్చి గారవ మెసఁగ భూవరునియాజ్ఞ
దనర నప్పాజి కపుడు వందన మొనర్ప
నతఁడు దీవించి తగును రాయలకు నిమ్మ
హోత్మరా లని మదిలోన హర్ష మలర 23

తే. అమ్మ కర్ణాటసింహాసనాఢ్యుఁ డగుచుఁ
జెలఁగుశ్రీకృష్ణరాయలఁ జెట్టవట్టి
మాదృశాశ్రితజనులు నీమహిమ నుతులు
సేయ వర్ధిల్లు మని వల్కెఁ జెలువుమిగుల 24

క. అలతుఖాఁరమణీమణి
జలజాస్యలు వెంటఁ గొల్వ జనకునియాజ్ఞన్
వెలయుచు నంతఃపురికిన్
విలసితగతి నరిగె నపుడు వేడుక మీఱన్. 25

మ. అలభూపాలకమౌళి తిమ్మరుసుతో నయ్యా మదీయాత్మజా
విలసత్ప్రౌఢిమఁ గాంచితే తెలుపుమీ వేవేగ శ్రీకృష్ణరా
యలతో నంచు వచించునట్టియెడ నత్యాశ్చర్యమొప్పారఁద
ల్లలనారత్నము వింత మీఱ నొకచిల్కంబంపెనచ్చోటికిన్. 26

క. పంచిన విరించియువతివి
పంచిరవోదీర్ణవాక్యబంధురఫణితిన్
మించి నిజపాణిసరసీ
జాంచలమున వేడ్కమీఱ నది వ్రాలుటయున్. 27

తే. కాంచి యమ్మంత్రి యెచ్చోటనుంచి వచ్చె
పంచదారలతీపు మేల్వచ్చవన్నె
మించుపంచాస్త్రవారువ మంచునాత్మ
నెంచ గజపతి కన్గొని యిట్టు లనియె. 28

క. ఇది మత్కుమారి బెంచిన
చదివినకీరంబు తనదుసౌందర్యగుణా
భ్యుదయము రాయలువినుటకు
ముదమున దెల్పు మని పంచె ముచ్చట గాఁగన్. 29

క. బంగారమునకుఁ బరిమళ
ముం గలిగినయట్లు నృపతిముఁగల మీ రీ
యంగనగుణంబు లెన్నఁగ
సంగతి దగ నిదియు మఱియు సన్నుతిసేయున్. 30

శా. దీనిం గైకొని పొండటంచు నతఁడెంతేఁప్రేమమీఱంగభూ
షానూత్నాంబరవాహనాదికము లిచ్చ నెమ్మెచ్చుగా నిచ్చి స
న్మానశ్రీరహిమించఁ బంచుటయు నమ్మంత్రీంద్రుఁ డాకార్యసం
ధానాత్యుద్ధతి నేఁగుదెంచెఁ బురకాంతల్మేడలం జూడఁగన్. 31

ఉ. ఎప్పుడు వచ్చు మంత్రిమణి యెప్పుడు వీనులవిందుగాఁగ నా
యొప్పులకుప్ప సద్గుణసమున్నతి చక్కఁదనంబు విందు నే
నెప్పుడు గాంతుఁ బెండ్లిహాయ లెప్పుడు పొం దొనరింతు
నంచు మే,ల్జొప్పడ భూవరుం డెదురుచూచుచు నుండఁగ సత్వరంబుగన్

తే. వచ్చి యప్పాజి యాధరావల్లభునకు
వేడ్క మీఱంగఁ దనచేత వెలయుచిలుక
ముంగల నిడంగఁ గనుఁగొని ముద మెసంగ
వింత యిది యేమి యనుచు నవ్విభుఁ డనంగ. 33

తే. స్వామియానతిఁ జని గజస్వామితనయఁ
జూచి వచ్చితి నెంతయుఁ జోద్య మయ్యె
నమ్మగువచక్కఁదనము బ్రహ్మాదులకును
వర్ణనలు సేయ శక్యమే వసుమతీశ. 34

క. ఆకంజాక్షివిలాసం
బేకీరం బెఱుఁగుఁగాని యితరు లెఱుఁగ రా
రాకేందువదన దీని గు
ణాకర యిట రాయబార మంపె న్వేగన్. 35

చ. అనుడు పరాకు సామి కరుణాకర రాయలదేవ మీకు వం
దన మొనరించెద న్వినుఁడు నామనవెంతయుఁ జిత్తగింపుఁడీ
జనవర నాదుపేరు సహజంబుగ మోహనవాణి యండ్రు నిన్
గనుఁగొనఁగల్గె నెంతయును కన్నులపండువుగాఁగ నియ్యెడన్. 36

ఉ. క్షీరసముద్రమధ్యమునశేషశయానునిపువ్వుదోఁటలో
గారవ మొప్పఁగాఁబ్రబలికల్మిలతాంగికిఁ బ్రొద్దుబుచ్చుచున్
సారవచోవిలాసముల సన్నుతిఁ గాంచిరి సర్వలోకసం
చారులుదొల్లి మాకొలముసాములుబూమెలుగాదుభూవరా. 37

తే. అలజగన్నాయకస్వామి యవతరించి
యిల వసించుట మజ్జనయిత్రి మఱియు
జనకుఁడును దర్శనార్థమై సరగ వచ్చి
యిచట శాశ్వతముగ నిల్చి రెలమితోడ. 38

తే. స్వామిసన్నిధి రత్నపంజరమునందుఁ
బ్రబలుచును బిన్ననాఁడె భూప్రజలవలన
వింటి గజపతిసుత సద్వివేకగరిమ
లెనయఁ జిలుకల బోషించు నెప్పు డనుచు. 39

చ. విని యొకనాఁడు వేడ్కఁ బృథివీవరనందన గారవించఁగాఁ
దనరెదనంచునెంచి వనితామణితానెప్రియంబు మీఱఁ గాం
చనకలశాంబుపూరములుజల్లుచుఁబోచినతియ్యమామిడుల్
గొనబగుకేళికావనులకుం జని క్రుమ్మరుచుంటి నెంతయున్. 40

ఉ. అంత వసంత మెంతయుఁ దనంత ననంతఘనాంత కాంతవ
న్యాంతికదంతురీభవదనంతలతాంతనితాంతకాంతితో
నంత శకుంతసంతతిహృదంతరసంతతచింతితార్థభా
స్వంతము పొల్చెనావిరహవంతుల కెంతయు వింతవింతగన్. 41

సీ. తొలుదొల్తఁ బండుటాకులు రాలె మహిమీఁద
విలసిల్లె మలయాద్రి మలయుసీఁద
యొక్కొక్క కెందలి రుదయించెఁ దరురాజిఁ
దోర మై తనరెఁ గంతునివరాజి
చెలఁగె దిక్తటులఁ గోయిలరావములసౌరు
మెదలాడె గండుతుమ్మెదలబాఱు
రహిమీఱె నపుడు మరందధారల చెన్ను
పొలుపొందె మెఱుఁగుఁబుప్పొడులవన్నె

తే. పొన్నగున్నలు సురపొన్న లన్నువ లగు
క్రొన్ననలచెన్ను లలరినవిన్న నెసఁగె
నెన్న నన్నన్న యాచైత్ర మెంతవింత
సంతస మొనర్చె రమ్య మై జనులకెల్ల. 42

ఉ. సారెకుసారెకుం గుసుమసాయకుఁ డధ్వగరాజిగుండియల్
దూఱఁగ వేగఁ జేవెడలి దూసి వెసన్ జళిపించురక్తసి
క్తారుణనూతనాయుధము లై మలయానిలమందమందసం
చారచలచ్ఛలాభ్రమతరుజాలముల న్మెఱసెం గిసాలముల్. 43

ఉ. మత్తిలి పీర లియ్యెడల మమ్ము గణింపక మానినీమనో
విత్తముల న్హరించెదరు వేగమె పాంథులు శిక్షసేతు మౌ
నిత్తఱినంచుఁ జిత్తజునిభృత్యులు తత్తఱపాటు మీఱఁగా
నెత్తినబెత్తులట్ల తగె నెంతయుఁ జక్కనిపూవుఁదీవియల్. 44

సీ. వేళాసతీపదాన్వితలాక్ష గగనల
క్ష్మీకుచద్వయకుంకుమాకలనము
ధర కదంబకసముత్కరసూనరాజి ది
శాంగనాశోణపట్టాంబరాళి
మోహాభిల్లీగళస్ఫురితగుంజాఫల
ప్రతతి యధ్వగమధువ్రతవినూత్న
చాంపేయతతి సుమాస్త్రస్యందనారుణ
దీప్తిమద్వైజయంతీవితాన

తే. మమితతరుమౌనిబృందజటాంశుపటలి
మాధవార్పితవల్లికామానినీవ
తంసమణిఘృణి తలిరాకు దనరె నప్పు
డంగజుప్రతాపవిస్ఫూర్తి నతిశయించి. 45

క. ఆమధుమాసదినంబున
నామధురవచోవిలాస మలరినవగ నా
రామ ముదం బొనరఁగ నా
రామమునకు రాఁ దలంచి రమణీయముగన్. 46

సీ. సరిగంచుజిలుఁగుచందురుకావికుచ్చెల
యడుగుఁదమ్ములయెమ్మె ననుసరింపఁ
దళుకులేముద్దుఁజెక్కులబెళుకుజిగితోడ
రతనాలకమ్మడాల్ ప్రతిఘటింప
గుత్తంపుకులుకుచన్గుబ్బకొండలతోడ
ముత్తెంపుపేరులు ముద్దుగుడియ
కళ లీనుకలువనెచ్చెలివంటిమోముపైఁ
గమ్మకస్తురిబొట్టు గమ్మనంగ

తే. మేల్మిసొమ్ములు క్రొమ్మించుమించు నణఁచ
వెంట రాయంచబోదల జంట లంట
మగువ లిరుగడఁ గొల్వంగ మందగతుల
వచ్చె గజరాజపుత్త్రి యవ్వనమునకును. 47

క. వచ్చి మణినూపురధ్వని
హెచ్చ న్నెచ్చెలులతోడ హేలాగతులన్
మెచ్చులర నవ్వనంబున
విచ్చలవిడి తరులనీడ విహరించె రహిన్. 48

సీ. ఒకదారి బకదారి చికిలిపారువముల
బిలిబిలిపలుకుల చెలువు వినుచు
నొకదండ శుకకాండ సుకుమారసారవా
గ్రమణీయకలకలారవము వినుచు

నొకమూల మజగాలయకనత్సరోవర
వికచారవిందము ల్వేడ్కఁ గొనుచు
నొకవంక నకలంకమకరందరసబిందు
ధారాఝరీతటుల్ దాఁటి చనుచు

తే. నలరునలరులు తలిరులు ఫలము లెలమి
చెలిమిచెలువలతోఁగూడఁ జిదిమికొనుచు
నగుచు మెల్లన నే నుండునవ్యఫలస
మన్వితం బైనయెలమావి కపుడు జేరె 49

తే. చేరి యపు డేను రాల్చినచిన్నిఫలము
లన్ని గైకొని ననుఁ జూచి యద్భుతమున
వెలఁది కనుఁగొంటె యిది యొక్కవింతచిలుక
యెచట నుండియొ చనుదెంచె నిచటి కిపుడు. 50

క. అని నెచ్చెలులుం దానును
ననుఁ బట్టుకొనం దలంచి నవ్వుచు రా న
వ్వనజాక్షితోడఁ బల్కితి
ఘనతరవాక్ప్రౌఢిమంబు గదలుకొనంగన్ 51

తే. తరుణి సామాన్యముగ నన్ను దలఁచ వలదు
ధరణిజనులకు ననుఁ బట్టఁ దరముగాదు
నీగుణాతిశయప్రౌఢి నేను మున్నె
చాల విని యుందు నెందెందు జగతియందు. 52

ఉ. కన్నులపండు వైతనరఁ గన్గొనఁ గల్గెఁ గదా లతాంగి న
న్మన్ననసేయ నీదుచరణంబులప్రాపులనుండ నెంచితిం
గన్నియనేనెఱుంగుదునుకాఁగలకార్యముగృష్ణరాయఁడన్
గన్నదరాజమౌళి నిను గౌరవలీలను బెండ్లియాడెడిన్. 53

తే. అనిన సిగ్గునఁ దలవంచి యలరుబోఁడి
యనుఁగు జెలువలు మెచ్చ సౌహార్ద మెనయ
నన్నుఁ జేకొని పంజరాంతరమునందు
గరిమతో నుంచి మిక్కిలి గారవించె. 54

శా. ఆగాంభీర్య మవార్య మాచెలిమి నిత్యానంద సంధాయకం
బాగానాన్వితసాహితీరమ యనన్య స్త్రైణసామాన్య యౌ
రా గంధర్వవధూవతంసములయం దావింత నే, జూడ లే
దౌ గాంధర్వవరాధిరోహణధురీణా కృష్ణరాయాగ్రణీ. 55

సీ. అచటితుమ్మెదబాఱు లబ్జాస్యనెరులతో
సరిరాక నో బెట్టు మొఱయదొణఁగె
నచటిపల్లవపంక్తి యబలపాదములతో
సమతఁ గాంచకనో చంచలతఁ జెందె
నచటికోయిలగుంపు హరిణాక్షిపలుకుల
కుదురంద నేరకో కూఁత లిడియె
అచటిపెందీవియ లలివేణిమేనిడా
లౌనరకో యుఱ్ఱూఁత లూఁగఁదొణఁగె

తే. నచటివిరిగుత్తు లాచెలికుచయుగంబు
రహి వహింపఁగ లేకనో రాలఁ గణఁగె
నపటిపూఁదేనె కనకాంగి యధరమధురి
మకు సమానంబుగాక నో మహినిఁ జెందె. 56

క. ఘను లానెరికురు లనుచున్
ఘను లాడం గడఁగి రౌర కాంతామణికిన్
దౌన లాజంఘిక లౌ నని
జను లాచట మెత్తు రౌర చంద్రాననకున్. 57

తే. నెమ్మిదోదుమ్మిబంగారునీటుకమ్మి
చమరవాలమ్ము వాలమ్ముసాటి యౌను
గతియు నూఁగారు నెమ్మేను కళుకుఁజూపు
బాలికామణి కెపుడు భూపాలతిలక. 58

తే. మీలు తామరపూలు క్రొమ్మెఱుఁగుచాలు
తరుణమృగి నేలు తరుణినేత్రములడాలు
తొమ్మిదవలెక్క వ్రాలు వీన్‌దోయిమేలు
పలుకులహొరంగు కపురంపుఁబలు కెసంగు. 59

తే. శంఖశంఖంబు లైనను సరసిజాక్షి
గళముతో సాటి గా వనర్గళజయాంక
తరుణినుఁగౌనుతో ననంతమ్ము లగు వ
సంతములు నైన సరిగా వహార్యధైర్య. 60

క. బొమలా కమలాసుతువిలు
రమలా రమణీయసటలరాజత్వములా
కమలారిద్వికళాభా
గములా విమలాంగి నెన్నఁగా వశమగునే. 61

క. పరిణతతాంబూలలతా
సరసదళావళుల గిల్లి సరగునఁ బెల్చన్
ధరణిరహి మీఱు నెంతయుఁ
దరుణీమణిముద్దుఁగుల్కు తళుకు ల్బెళుకుల్. 62

క. కురువిందమ్ముల తమ్ముల
సరవింద మ్మేలు మనఁగ సౌ రౌనవలా
గరగర నౌపల్వరుసల్
గరగర దానింబవిత్తుగమి నదలించున్. 63

సీ. ఔరౌర శరదుజ్జ్వలాబ్జమో దూరీకృ
తాబ్జమో తరలాయతాక్షిమోము
హైసరే హృదయాపహారమో మౌక్తిక
హారమో యెలనాగయులఁతినవ్వు
చాఁగురే శృంగారసారమో నిమ్నకా
సారమో తన్వంగిసరసనాభి
చాబాసు మేదినీచక్రమో మరుతేరి
చక్రమో పూఁబోణిజఘనసీమ
తే. రంభలో హస్తికరజయారంభ లేమొ
యురుతర స్తనిపలుచనియూరు లౌర
రాజదేవేంద్ర యటువంటిరాజముఖినిఁ
గంటిమే వింటిమే తొంటికతలనైన. 64

తే. నాస హేమంబు గావున నాసఁజేసి
యనుసరించెనా నువ్వుఁబువ్వనఁ జెలంగు
రాచజవరాలిమోమున రహిఁ జెలంగు
ముద్దుబంగారుముంగఱముత్తియంబు. 65

ఉ. ఆరమణీలలామ మలయానిలచంచలదూర్మికానట
త్పారసరాజహంసఘనసారసపాళిమదాళిజాలసం
చారసమంచితారవవిశాలగభీరజలాశయంబునన్
దోరపువేడ్కఁ నెచ్చెలులతో జలకేళి యొనర్చె వేడుకన్. 66

సీ. బంగారుపావడల్ చెంగావిపుప్పొడుల్
సింగారము లెసంగుజిగి మెలంగ
ఘనవళీకాండముల్ కల్లోలతండముల్
మెండుగా నొండొండఁ దాండవింప

విమలదృగ్బృందముల్ వికచారవిందముల్
క్రందుగానందంద పొందు సల్ప
కచభృంగజాలముల్ కలితశైవాలముల్
మాలిమి నన్యోన్యకేళిఁ దేల

తే. నతులితోత్సాహ మంతంత నతిశయించ
సరసి విహరించునప్పు డబ్జాతముఖులు
పాలసంద్రంబులోపల నోలలాడు
వేలుపువెలందులో యన వెలసి రపుడు. 67

తే. గంధమాల్యాభరణవస్త్రకలిత లగుచు
శాస్త్రపద్ధతి సకలోపచారములను
తెలివిఁ జెలువొందుకపురంపుఁదిన్నెలందుఁ
బువ్వుబోఁడులు వలరేనిపూజజేసి. 68

క. కన్నడసేయకు మదనా
కన్నడరాయఁ డగు రసఘనుఁ గృష్ణేంద్రుం
జెన్నలరఁగ గజనాథుని
కన్నెకుఁ బతిసేయు మనుచుఁ గలకల నగుచున్. 69

మ. తనవెంటం గొలువంగఁ బ్రాణసఖులందాత్పర్యముప్పొంగఁ
గాఁ, గనుచున్వేడుకలుల్లసిల్లగనుసౌఖ్యస్ఫూర్తినంతఃపురం
బునకుం జేరలతాంగిసత్కరుణ నన్ బోషింపుచున్సత్కథల్
వినుచు న్విద్యలఁ బ్రొద్దుబుచ్చు నెపుడున్ లీలావతీమన్మథా. 70

సీ. ఏవేళ భవదీయలీలావిశేషముల్
వేవేలవిధముల వినుచునుండు
నేవేళ యుష్మత్ప్రభావసంతోషముల్
వేడుక ల్వెలయంగ వినుచునుండు

నేవేళ తావకీనావిష్కృతయశఃప్ర
వీణతేజస్థితు ల్వినుచునుండు
నేవేళ మీజయశ్రీవితీర్ణకళావి
వేకవైభవములు వినుచునుండు

తే. కృష్ణమూర్తివె నీవు శ్రీకృష్ణరాయ
సత్యముగ నవ్వధూటియే సత్యసుమ్మి
కలుగుఁ గళ్యాణ మిదిగొ శీఘ్రముగ మీకు
నతులితసుఖైకవార్ధినోలాడు మధిప. 71

వ. త్వదీయహితార్థంబుగా తదీయరూపరేఖావిలాసగుణంబులు ప్రకటింపం జను దెంచితిఁ దొల్లిదమయంతీనలదూత్యం బొనరించినరాజహంసంబు చందంబున భవత్కారుణ్యంబు గాంచితిం బోయివచ్చెద నీకు నమస్కృతి యొనర్చితి ననుచుం గలకలధ్వను లెసంగ నయ్యనంగతుఖ్కారంబు తుఖ్కారమణీ మణిగృహాంగణంబునకుం జని తన్మనఃప్రియం బొనర్చె నంత నయ్యనంతాధీశ్వరుండును సభాసదులు నద్భుతానందం బులం జెందుచు సుఖం బుండి రయ్యవసరమున. 72

సీ. కట్టిరి నవరత్నఘనతోరణంబులు
కడువేగ రాజమార్గములయందుఁ
బట్టిరి శోభనప్రకటితద్రవ్యముల్
రంజిల్ల మిగులహేరాళముగను
జుట్టిరి రంభాదిసురుచిరస్తంభాళి
రహి మీఱ చిత్రవస్త్రములసమితి
పెట్టిరి దట్ట మౌక్తికాణిముత్తెంపు
ముగ్గులు ద్వారభూములఁ జెలంగ

తే. సరగ నెందెందు గజపతిపురమునందు
నభినవాలంకరణలీల హర్ష మెసఁర

సంతతోత్సాహచిత్తులై సకలజనులు
నంతవైవాహికోత్సవం బతిశయించ. 73

ఉ. అంతట సామజేంద్రుడు దిగంతసమాగతబాంధవావళుల్
సంతసమందఁ గీర్తిజితచంద్రుఁ డనంఘగుకృష్ణరాయభూ
కాంతునకుం గొమార్తె నొసఁగన్ సుముహూర్తము నెంచి
వేడ్కతో, నంతిపురం బలంక్రియల నంద మొనర్చె విచిత్ర వైఖరిన్.

ఉ. పెండ్లికొమార్తెఁ జేయుఁడని పెద్దలు బల్క మిటారితళ్కుపూ
బోండ్లు నృపాలపుత్త్రికను పుత్తళిమేల్ జిగిపీఁట నుంచి హొం
గిండ్లను తావినూనె తగు గిన్నెల బంగరుపళ్లెరంబులన్, బం
డ్లును కుంకుమంబెసఁగఁ బాటలుపాడుచుఁదెచ్చిరయ్యెడన్.

క. వనితామణి తలయంటెన్
జనితామోదమునఁ బటుకుచద్వయి గులుకన్
నునుగొనళుకుం దాటం
కనటత్కంకణసువేణికలును జెలంగన్. 76

తే. జలకమాడి మెఱుంగుదువ్వలువ దాల్చి
గంధమాల్యాభరణవస్త్రకలిత యగుచు
మించుటద్దంబు వీక్షించి మెఱుఁగుఁబోడి
యంగజునిరాజ్యరమవోలె నలరెనపుడు. 77

తే. తనకు జోడగునొకరాజు ఘనతరాన్వ
యమునఁ గలిగెమ కృష్ణరాయ లయి సత్య
మరిభయంకరతేజోవిహారి యనుచు
వెఱచి వేవేగ సిగ్గున జరగె ననఁగ 78

తే. సమయనరు దబ్ధిరణసీమఁ జక్రసింధు
ధవువియోగాగ్ని పాశుపతమున నేయు

మించి రయముస దాఁకఁగ మిట్టిపడిన
తత్కిరీటంబురీతిని దళు కెసంగి. 79

చ. ఇనుఁ డపరాబ్ధిఁగ్రుంకె గగనేందిర దాల్చినకుంకు మంబనాఁ
దనరెను సాంధ్యరాగరుచిదట్టము లై కనుపట్టెఁ దార ల
య్యనిమిషభూషణోజ్జ్వలములౌమగరాలమెఱుంగుగుంపు
లో, యనగ మనోజుఁడొక్క మొగి నంతట జల్లినతూపులో యనన్.

మ. తనబాహ్యస్థిరకార్యసంగగరిమన్ దా నిల్చునజ్ఞానమో
యనఁగాఁజీఁకటిమించెవెన్కఁగనినౌనచ్ఛత్వమోనాగఁబ్రా
గ్ఘనపాండుప్రభదోచె సత్త్వగతలింగంబోయనంజంద్రుఁడొ
ప్పెనిజానందకళల్ జెలంగెననఁగల్పించెన్కనచ్చంద్రికల్. 81

మ. కృపయొక్కింతయు లేకచిత్తజుఁడుసారెన్వాఁడిక్రొందళ్కుతో
రపుచెంగల్వమెఱుంగుతూపులెదఁదూఱంబెట్టగానేయఁగా
విపరీతస్థితిఁ గోయిల ల్మొరయఁగా విభ్రాంతితో మించఁగా
నపు డావెన్నెలకుం గలంగె నలకన్యారత్న మత్యంతమున్. 82

ఆ. కలఁగి కలువజేనిఁ గనుఁగొని కటకటా
తగునె చంద్రనీకుఁ దలిరుబోండ్ల
నలఁచుదుర్గుణంబు కిలకాల మీగతిఁ
బాప మెనయు నేమి ఫలము దీన. 83

సీ. ఇనునితో జోడుగాఁ దనరెద ననుచునో
యధ్వగావళి నిట్టు లలచు టెల్ల
సోమనామము దాల్చి సొలసెద ననుచునో
యుగ్రరూపస్ఫూర్తి నొనరు టెల్ల
బడబాగ్నితోఁగూడ బొడమితి ననుచునో
వేఁడివెన్నెలచే వేచుటెల్ల

హరిసమాఖ్య వహించి యలరితి ననుచునో
పటుభయంకరవృత్తిఁ బరఁగుటెల్ల

తే. పద్మినులఁ బ్రోచి చెలువుచేఁ బ్రణుతిఁ గాంచి
చల్ల నగుచోటనే నిల్చి జనులు మెచ్చ
జగతి కాదరు వైనదతస్సద్గుణంబు
లెంచ వారలసమత నీకేల కలుగు. 84

మ. అరయంగాఁ దనతల్లియింటి కహితవ్యాపారముం జేసి యి
ద్ధర నాత్మీయవిరోధియౌ శివునకుం దాభూషణం బయ్యేనే
తటి నమ్మందగఁడంచునెంచక నినుఁ దామామగానెంచుతా
మెరతూపుందొర యింతమాత్రమునకై మిన్నందెదే చంద్రమా. 85

తే. అరయఁ బాశ్చాత్యమహిభృత్పదాంతరమునఁ
దింగి సురపానహితరీతి సొబ గెసంగి
సరగ గురుభక్తి దొరగి గోసంగి వైతె
నీకుఁ జెల్లునె ద్విజరాజనియతి చంద్ర 86

క. నక్షత్రేశత గలని
స్నీక్షితి రా జనఁగఁ దగునె యెప్పుడు నమరుల్
ప్రక్షీణునిఁ జేసిన నీ
వక్షయగతి బ్రతికె దొర యాశ్చర్యముగన్. 87

వ. అని యివ్విధంబున

తే. చందమామను దూరి నీచందమాన
చంద మామందమారుత స్యందమాన
బిందుమాధుర్యధరశరబృంద యనుచు
నందమానందనునిఁ బల్కెనలరుఁబోఁడి. 89

తే. మార నిను శంకరుఁడు పలుమారు మార
వలయుఁ గ్రమ్మఱ బ్రతికించఁ దలఁచె నకట
యట్టి యవివేకమునసుమీ గట్టుఁబట్టి
బెట్టుజటగట్టి భైక్షంబు బట్టఁ గడఁగె. 90

పంచచామరము

రమాకుమార సారె పాంథరాజి నెంచ నిట్లు బీ
రమా యుమాధినాథుతోఁడ రాయడించి మించి నే
ర మాని తౌర నీకునుందురంగ మొక్కకీరమా
రమారమి న్మెలంగ కౌర రవ్వ సేయ సారమా. 91

సీ. మెత్తందనము గల్గు నెత్తమ్మిరేకుల
కేలాగు గలిగెనో యిట్టివేఁడి
కోమలత్వముఁ జెంది కొమరొందుకలువల
కేరీతిఁ గలిగెనో యిట్టివాఁడి
చల్లనై వలపుచే నుల్లసిల్ మొల్లల
కేలాగు గలిగెనో యిట్టియుడుకు
మంచిమాటలచేత నంచితం బగుచిల్క
కేవగఁ గలిగెనో యిట్టిదుడుకు

తే. కటకటా నీవు చేపట్టఁ గాని కాదె
ఇప్పు డిన్నియు న న్నిట్టు లేఁచఁ దొడఁగె
జగతి నెటువంటివస్తువు ల్సద్గుణంబు
విడువకుండునె దుర్గుణాన్వితునిఁ గూడి. 92

క. పలుభూజములం దిరుగుచు
బలుభూతం బైననిన్ను బాములఁ బెట్టఁ
వలయును సుడిఁబడఁ గా ని
మ్మలయుటఁ జాలించి నిలుమ మలయానిలమా. 93

వ. అని మఱియును. 94

క. చిలుకా నాపాలికి మరు
చిలుకా నీ విపుడు చెలిమిఁ జేసితె మున్నే
పలుకాదర మెనయవుగా
పలుకాఁకలపాలు సేయఁ బాడియె నీకున్. 95

తే. ఔర నీయైకకంఠ్య మేమనఁగ వచ్చుఁ
బల్లవాసక్తిఁ బ్రబలి తా ప్రజలు నవ్వ
నల్లపలుగాకులనుగూడి తనుచుఁ గాదె
కోకిలా నిన్ను రాముఁడు కోపగించె 96

తే. తుమ్మెద నటంచు వత్తు వెందును జెలంగి
నీదుమధుపానవృత్తి గణించ నేల
చుఱుకుముట్టంగ మొరయుచు సోఁకునట్టి
యలిశిలీముఖ మంచు ని న్ననఁగ వినవె. 97

క. అని విధుమదనులను సమీ
రణశుకకోకిలల మధుకరంబును నిందిం
చును వనితామణి ఘనతర
కనదనుపమవిరహతాపగతిఁ గలిగించన్. 98

క. అచ్చెరువుఁ జెంది నెచ్చెలు
లచ్చానకు శైత్యకృత్య మలరించి మఱిన్
మెచ్చులరంగ వచించిరి
విచ్చలవిడి గారవంబు వెలయఁగఁ గరుణన్. 89

ఆ. ఇంత కలఁగ నేల యెలనాగ రేపు మా
పటికిఁ బెండ్లి యౌను ప్రౌఢివెలయ

నీకుఁ గృష్ణరాయభూకాంతునకును నీ
ఓంతితార్థఫలము సిద్ధి యగును. 100

తే. అని యనేకవిధంబుల ననునయించి
గారవింపుచు మిక్కిలి యూఱడించి
తెలివితో నుండె నెంతయుఁ దీవెబోణి
యప్పు డంతంత వేగుజా మయ్యె నచట. 101

క. మిన్నక కుక్కుటములు తమ
చెన్నగుకాలజ్ఞరీతి శివు బాహ్యముగా
నెన్నఁద రదేమి మీయం
దున్నాఁడో యనుచుఁ దెలుపునోజ న్మొరసెన్. 102

చ. అలగురుఁ డట్టివేకువ సురాపగఁ గ్రుంకి తదీయతీరమం
దలరిచినట్టిసైకతమయంబగులింగము పూజసేయఁగా
దలఁచి తదేకనిష్ఠ నవతామరసం బపు డెత్తె భక్తి రం
జిల నన వేగుఁజుక్కవెలసెఁ దళుకుంజిగితోడఁ బ్రాగ్దిశన్. 103

తే. అపుడు ప్రాగ్భామ స్నానార్థ మర్ణవంబు
దరిని నుదయాచలాంతికస్థలమునందు
నారపైచినచెంగావిచీర యనఁగ
నరుణదీధితి గన నయ్యె నంచితముగ. 104

సీ. ఇంద్రుఁడు కొలువుకు నేతెంచి పఱుపున
గీలించుమహితాశికెం పనంగ
నమరులసభఁ జూడ నరుదెంచునొకభక్తి
పరుఁడు దెచ్చిననిమ్మపం డనంగ
నందనవనమందుఁ గ్రందన నెరజాజు
పొలుపొందుదానిమ్మపూవనంగ

వినయంబుతోడ నింద్రునిభృత్యుఁడు ధరించు
కెంగేలిబంగారుగిం డనంగ

తే. నప్పు డుదయించి వచ్చె నీహారతిమిర
కువలయచకోరవిస్ఫూర్తి గుందుపడఁగ
విశ్వజనచక్షురంభోజవితతితోన
బద్మతతు లెల్ల వికసించఁ బద్మహితుఁడు. 105

తే. అప్పు డప్పాజి కృష్ణరాయలను బెండ్లి
కొడుకుఁ జేయంగ నెంచ పుత్తడిమెఱుంగు
డంబుల నెసంగుబలుదివాణంబులోన
భద్రపీఠంబుపై నుంచెఁ బ్రౌఢి మించ. 106

వ. తదనంతరంబ. 107

చ. కులుకుచు సబ్బరంపుబిగిగుబ్బలు పయ్యెటలోన మించఁగా
నళుకుచుఁ గౌనుఁదీఁగె శ్రవణాభరణంబులు హారవల్లరుల్
బెళుకుచు నిగ్గు లీన వలభిన్మణివేణి నటించ తావినూ
నెల సిరసంటె నొక్కతరుణీమణి కన్నడ రాయమౌళికిన్. 108

క. హృద్యానవద్యవాద్యర
వాద్యసుగీతస్వనంబు లతివలపాటల్
చోద్యం బొసంగె నెంతయు
సద్యోవైవాహికప్రసన్నతఁ దెల్పెన్. 109

ఆ. ఒకలతాంగి తావి యొనరినయటకలి
యొసఁగ వేగ నొక్క బిసరుహాక్షి
నెరులు ప్రామ నొక్కనెలఁత కొప్పెరనీట
జలకమార్చె క్రొత్తవలువ లొసఁగ. 110

క. తడి యొత్తె నప్పు డొకపు
త్తడిబొమ్మ నృపాలమణికిఁ దాత్పర్యమునన్
వడి సాంబ్రాణిని ధూపం
బడరించె లతాంగి యొకతె యవనీపతికిన్. 111

సీ. సరిగంచువలిపమేల్ జంటిరుమాలుడాల్
నెరులపూసరులపై నీటుజూప
వెలలేనిముత్యాల తళుకుచౌకట్లతో
మగరాలబావిలీ లొఁగసుఁజూప
మెఱుఁగారుజాతికస్తురిగీఱుబొట్టుతో
ముంగురు ల్పలుమాఱు ముచ్చటాడ
తలుకుగందంపునిద్దపునిండుపూఁతతోఁ
జలువదుప్పటినిగ్గు సరస మలర

తే. మూరురాయరగండ పెండేరముఖ్య
లలితభూషణకలితుఁడై యలరె నప్పు
డలరువిలుకానిచెలువంబు నతిశయించి
వీరనరసింహరాయకుమారశౌరి. 112

క. వైవాహికార్హవస్తు
శ్రీ వెలయఁగఁ దత్తదుచితశృంగారవిధుల్
వేవేగ నొనర్చుచు గజ
భూవిభుఁ దలరె న్సితాంతమోదం బెసఁగన్. 113

క కులదేవతార్చనాదిక
విలసితకళ్యాణలీల వెలయఁగ నెంతేఁ
జెలఁగిరి యంతఃపురిలో
సులలితవిప్రాంగనాదిసుదతులు వేడ్కన్. 114

మ. ఇనుఁ డస్తాద్రికిఁ జేరెఁ జక్రములకుం దేపారె నాకాశమ
ధ్యనిరూఢద్యుతితారకాప్రతతు లంత న్వింతలై సారెసా
రె నిరీక్షించఁగ వేడ్కలూరె శశి మీఁదెంప్రాగ్దిశాభామినీ
ఘనవక్షోరుహహారమౌక్తికమనంగా వారియుప్పొంగఁగన్. 115

సీ. హాటకోన్నతకాంపాటలద్యుతి మించు
దివ్వటీల్వేనవేల్ తేజరిలఁగ
వజ్రమౌక్తికముఖ్యవరరత్ననిర్మిత
చ్ఛత్రచామరకాంతి చౌకళింప
బిరుదాంకకేతనస్ఫురదంబరచ్ఛటల్
మించి యంబరమున సంచరింప
మౌళిమండనరత్నపాళీలసద్ద్యుతుల్
దీపాంకురంబులఁ దెగడి మెఱయఁ

తే. బగలువత్తులు దినకరప్రభల వెలుఁగ
నపుడు గజపతి దోడ్తేర హవుసుమీఱ
వచ్చెఁ బెండ్లికుమారుండు వాద్యరవము
లెసఁగఁ బెండ్లిండ్లకడకు భద్రేభ మెక్కి. 116

ఉ. వచ్చి మదేభముం డిగిసువాసిను లిచ్చుమెఱుంగుటారతుల్
మచ్చికమీఱఁ గన్గొని చెలంగుచు ద్వారము లెల్లఁదాఁటిభా
స్వచ్ఛటులేందుకాంతమణి నంపుటితం బగు పెండ్లితిన్నెపై
హెచ్చినహేమపీఠముపయిన్వసియించెనృపాలుఁడయ్యెడన్. 117

మ. ఘనవిప్రుల్ నృపమౌళిచేనపుడు సంకల్పంబు సేయించి భూ
జనరక్షాంచిత మైనహస్తమున భాస్వత్కంకణం బుంచి చెం
దినవేడ్కన్ గజరాజనందనను దోడ్తెమ్మన్న బాలామణుల్
మనసుల్ రంజిలఁ బాట లుల్లసిల శుంభల్లీలఁ దోడ్తెచ్చినన్ 118

తే మదనుఁ దనుబొమ్మలాటగాఁ దద నెఱింగి
రాజునెదుటికిఁ దెరలోన రహిఁ జెలంగు
మెచ్చుబంగారుప్రతిమను దెచ్చె ననఁగ
వచ్చెఁ బెండ్లికుమారి చెల్వంబు మీఱి. 119

తే. సరగ దెరబట్టి మంగళాష్టకము జదువఁ
బట్టిఁ దనయొద్ధఁ గూర్చుండఁ బెట్టుకొనుచు
నపుడు గజపతి సంకల్ప మాచరించెఁ
దెలివిగను గోత్రనామముల్ కలయ నుడివి. 120

తే. సరగపట్టపుదేవియంజలి నొసంగు
కలశజలములచేత రాయలపదాబ్జ
ములకు నర్ఘ్య మొసంగి యాభూవరుండు
గంధమాల్యాభరణవస్త్రకలితుఁ జేసి 121

క. మధుపర్కం మొసఁగి కలశాం
బుధి హరికిఁ లక్ష్మి నొసఁగుపోలికె గజరా
డ్విభుఁడు సుత దారవోసెం
బ్రథితోన్నతి మీఱఁ గృష్ణరాయల కెలమిన్. 122

ఆ. అట మిటార్లు గొంద రపరంజిజిగిమెట్టుఁ
బ్రాలపుటికె లిడిరి ప్రౌఢి మిగుల
శంఖకాహళాదిసద్రావములు మ్రోయఁ
బాటలాధరాళిపాట లెసఁగ. 123

క. శృంగారవతిగళంబున
మంగళసూత్రంబు గట్టె మహనీయకళల్
రంగలరఁ గృష్ణరాయలు
సంగతి దనర న్నితాంతసంతోషమునన్. 124

తే. ఆపుడు తలఁబ్రాలు వోసి యన్యోన్యమ స్త
కముల నెలమి వధూవరుల్ కమలశరుఁడు
రతియుఁ దమకీర్తితతులు ధరాతలమునఁ
దేటపడఁ జేసి రనఁగ ముత్తెములగముల. 125

తే. అలయరుంధతిదర్శన మాచరించి
యెలమిమీఱ వధూవరు లిచ్చి రఖిల
జనుల కెంతయుఁ దాంబూలచయము జాల
వల్లికలకాంతు లంతట నుల్లసిలఁగ. 126

క. విలసితబహువైభవముల
నలరుచు నాగవలిఁ జేసి యఖిలార్థిజనం
బులకు వరహాలుమాళ్వి
చ్చలవిడి పచ్చడము లిచ్చె జనవరుఁ డంతన్. 127

తే. ఘనతరాపూపసూపాజ్యకలితభోజ
నముల సంతృప్తిఁ జెందె బాంధవజనంబు
లభినుతింపంగ వశమె బ్రహ్మాదులకును
వలను మీఱంగ నప్పెండ్లివైభవంబు. 128

క. అంత నవరత్న కాంచన
కాంతం బై వెలయు కేళికాగృహమున న
భ్యంతరశయ్యాతలమున
నెంతయు రాయలు వసింప నెలమి దలిర్పన్. 129

మ. చెలువ ల్దోడ్కొనిరామణీఖచితమంజీరధ్వనుల్ మించఁగాఁ
దళుకుంజెక్కుమెఱుంగుటద్దములపైతాటంకరత్నద్యుతుల్
వెలయం దా గజరాజపుత్త్రి యగుటీవిం దెల్పుచందాన వ
చ్చె లతాంగీమణి మందమందగతు ల్శృంగారముప్పొంగఁగన్. 130

తే. వచ్చి పడుకింటిగడప కివ్వలనె నిలిచి
సిగ్గున శిరంబు వంచునచ్చిగురుబోఁడి
తచ్చనల్ మెచ్చ పదమంచుఁ దలిరుబోండ్లు
నృపతిముంగల నిల్పిరి నేర్పు వెలయ. 131

తే. రాయబారంబు బంపె నీరమణి కృష్ణ
రాయ భారంబు మీదె యీరాజవదన
చాల దయచేయుటకు ముద్దరాలుసుమ్మి
యే మెఱుంగదు గోల భూమీశతిలక. 132

క. అని యొకనెపంబుఁ బెట్టుక
యనుఁగుంజెలువలు జనంగ నవనతముఖియై
కనకమణిస్తంభము మఱుఁ
గున నిల్చినతరుణిఁ జూచి కుతుకం బలరన్. 133

తే. అపుడు నరనాథుఁ డింతి కిట్లనియెఁ దరుణి
యింత సిగ్గేల నీకు నిన్నెప్పు డెవ్వ
డెనయుదు నటంచు మదిలోన నెంచియున్న
నన్ను దయసేయఁ గదవె పొందళుకుబొమ్మ. 134

క. స్థిర మగుదుర్గవ్రజమున్
స్థిరరణమున నాక్రమించితిన్ శీఘ్రముగా
మరురణమున నీకుచయుగ
వరదుర్గము లాక్రమింపవలయుం జుమ్మీ. 135

క. అని సరసోక్తులు మెరయన్
వినతాంగిం జేర దీసి విరిపానుపునన్
మనసారఁ గౌఁగిలింపుచు
జనితామోదం బెలర్ప జనవరుఁ డంతన్. 136

సీ. వాలారుకొనగోట జాలపెన్నెరిగొప్పు
నీటుగా పలుమాఱు నిమిరి నిమిరి
మొలక లౌతరుణిచన్నులమీఁద నెంతయు
నొరపుగా నెలవంక లుంచి యుంచి
తళుకులొాచును ముద్దుగులుకుచెక్కిళ్ళను
ననువుమీఱఁగ ముద్దు లాడి యాడి
తేనియల్ జిప్పిల్లుతెరవనిద్దపుమోవి
చాలంగఁ దనివారఁ గ్రోలి క్రోలి

తే. యలరుపై వ్రాలునెలదేఁటిచెలువు మించి
పంచశరశాస్త్రసరసప్రపంచసరణి
నమితరతిసుఖవార్ధి నోలాడి మిగులఁ
దనిసి తనియించె లలితాంగి ధరణివిభుఁడు. 137

మ. అలవేదండనృపాలుఁడశ్వగజభూషానేకసద్వస్తువుల్
కొలఁదుల్ మీఱఁగ నిచ్చిపంపఁగ దిశల్ ఘూర్ణిల్లుభేరీరవం
బులతో సేనలు గొల్వఁ దేజమడరన్ భూమీజను ల్మెచ్చఁగా
జలజాతాక్షుఁడనంగరాయలపుడుత్సాహంబునం గ్రమ్మఱెన్. 138

క. అరణముగా గజపతివా
రరుదారం గృష్ణ కవలియఖిలస్థలముల్
సరసత నొసంగఁ గైకొని
వరజయకీర్తిప్రతాపవైభవ మలరన్. 139

తే. కల్బురగికోటమీఁద లగ్గలకు నెక్కి
కార్య మొనరించి జయలక్ష్మిఁ గాంచి యచట
నుండి తనరాజ్యమునఁ గల్గునొరపుమీఱు
మంచిదేవస్థలంబు లీక్షించ నెంచి 140

సీ. శ్రీశైలకాళహస్తిచిదంబరాదిక
రమణీయశైవస్థలములు జూచి
శ్రీరంగ కాంచికాశేషాచలప్రము
ఖములైనవిష్ణుస్థలములఁ జూచి
అర్ణవఘనతామ్రపర్ణీకవేరసు
తాముఖ్యపుణ్యతీర్థములు జూచి
చోళకేరళపాండ్యసురుచిరనిజభుజా
శ్రయదేశజాగ్రహారములు జూచి

తే. విలసితోత్సవములు చాలవెలయఁ జేసి
విజయపురి గోలకొండవా ర్వెఱగుపడఁగ
విజయనగరంబుఁ జేరె దిగ్విజయలీలఁ
బ్రజలు వర్ణింప శ్రీకృష్ణరాయనృపతి. 141

తే. బంధురకవీంద్రకృతులలోఁ బ్రౌఢిఁగన్న
మనుచరిత్రాదికృతు లంది మహిమ చెలఁగి
సకలసామ్రాజ్యవైభవ సరణి వెలయ
ధరణియేలుచు నుండె నద్ధరణివిభుఁడు. 42

శా. సర్వాణప్రపదివ్యనామబలభిన్నీలోపలశ్యామగం
ధర్వస్తుత్యయశోవిహారజనహృత్రాపార్తిసంహారవాక్
చర్వాణీరమణాదృతప్రదమహాశౌర్యప్రభావోదయా
యార్వీట్యన్వయచిన్న వేంకటధరాధ్యక్షార్చితాంఘ్రిద్వయా. 143

క. శరణాగతరక్షణఘన, బిరుదాంకాభక్తిమద్విభీషణకరుణా
భరణాంతఃకరణాతి, స్ఫురణాసకలదివిజప్రపూజితచరణా. 144

ఉత్సాహము. తాటకాహరా ప్రసిద్ధతారకాక్షరప్రదా
హాటకాంగహావతంస హారభూషణోజ్జ్వలా

పాటితారివీర నిత్యపావనాకృతీ జగ
న్నాటకక్రియాధురీణ నవ్యసద్గుణోన్నతీ. 145

గద్యము. ఇది శ్రీమదోరుగంటి కాశీపతి సద్గురు రాజయోగీంద్ర చరణార విందసంధానిత మనోవిహార నిరంతరానందకర రాజయోగసామ్రాజ్య లక్ష్మీధురంధర స్వస్వరూపానుభవసంపన్న జ్ఞానప్రసూనాంబికా కాళహస్తీశ్వరకటాక్ష వీక్షణ ప్రసాదాసాదిత కవితాచమత్కార ధూర్జటి పౌత్ర కాళయామాత్య లక్ష్మ్యంబికాదత్త పోలనమంత్రి గుర్వమాంబికా కుమారధూర్జటి ప్రణీతంబైన కృష్ణరాయవిజయంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

కృష్ణరాయవిజయము సంపూర్ణము



అక్వైరియన్ ప్రింటర్స్, గంజ్ బజార్, సికింద్రాబాద్-3.